# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 30 | ఏలూరు 15 ఫిబ్రవరి 1942 | సంచిక 11 |
|---|---|---|


## నిత్య సంకీర్తనము

**వివరణము :**

ప్రపంచము భౌతికవిషయములఁ దగుల్కొనియున్నచో నది మొద్దుబారి రస హీనమైపోవును. మాటవినదు. చిత్తమటులుండినచో మనధ్యాన సమయమున దానిని భగవంతుని వైపునకుఁ ద్రిప్పుటకెంత యత్నించినను వశపడదు. కాని నియమముల ననుసరించి జీవితమును క్రమముగ గడపువారిస్థితి వేరు. వారెల్లప్పుడును చుఱుకుగనుందురు. వారెన్నడును తమ యాధ్యాత్మిక సాధనలను మఱువరు. వారి పనులన్నియును సాధనాపరములై యుండును. మనముకూడ నిట్లే యొనర్తుమా భావములున్నతమగును. మనచిత్తవృత్తి మన జాగ్రత్త ననుసరించియేయుండును.

**సంకీర్తనము :**

1. ప్రభూ ! మాజీవితము నున్నతభావ పూరితమును, తేజోమయము, నొనర్పుము.

2. నాచిత్తము నీయందు లగ్నమై విషయవ్యామోహమున కతీతమై నీచెంతనే వసించుఁగాక !

—స్వామిరామతీర్థ.

# నా యిక్కట్లు

(పి. యస్. వి. శేషాచలయ్య)

ప్రస్తుతకాలపు ప్రాథమిక పాఠశాలల యందుండు నుపాధ్యాయులస్థితి నానాటికి క్లిష్టస్థితిని దాల్చుచున్నది. ఉపాధ్యాయ వృత్తికి గ్రామములందు బొత్తుగా గౌరవము లేకపోయెను. ఇదిలేనపుడు పలుకుబడిమాట యసందర్భమనుట నిస్సంశయము. ప్రస్తుతకాలపు విద్యా నిబంధనల నుపాధ్యాయుఁ డనుసరించిననే విద్యాధికారులచెంత సదభిప్రాయ పరుడనిపించుకొనగల్గును. గ్రామములందు వారినిబంధనలేమాత్రము ఆదరణీయములుగా కనుబడకుండుట శోచనీయముగా నున్నది. వారినుండి వచ్చిన యుత్తర్వులు గ్రామస్థులకు చూపుదమన్న హాస్యాస్పదమగునని సంశయముగనున్నది. ఇట్టిఇబ్బందులలో ఉపాధ్యాయుఁ డెవరిననుసరించుటయని సందేహము కల్గుట కాటంకములేదు. విద్యాధికారుల నిబంధనలను పాటించుటయా? లేక గ్రామస్థుల గౌరవమునకు పాత్రుడగుచు వారినిబంధనల ననుసరించి వర్తించుటయా యనియేసంశయము. ఇందులో దేనిననుసరించినను మరొకరివలన కష్టముగల్గునను మాట నిక్కము. విద్యాధికారుల త్రోవ బోవుదమన్న గ్రామస్థుల యభిమతముల నీడేర్చుటకష్టము. గ్రామస్థుల యనుమతి మేరకు నడచుకొని కాలముగడుపుదమనిన విద్యాధికారులకు తప్పక వ్యతిరేకించిన వారమగుదుము. అందుచే మహత్తరమగు కీడువాటిల్లకమానదు. గ్రామములలోనా వుపాధ్యాయుఁ డాబాల గోపాలమునకు సహాయకారియై యుండవలెననుట సహజము. ఇది మన మానసతృప్తికి సంతృప్తిగానేయున్నది. గ్రామస్థులకు వ్యతిరేకించిన ఇక రిపోర్టుపై రిపోర్టు చక్కగా తయారగుట యటుండనిచ్చి, బాలురను గప్పించుకొనుటతో నాటంకము, ఆగ్రామ నివాసమునకే యాటంకము గల్గునందుల కేఆక్షేపణము లేదు. ఆరిపోర్టుసంగల విషయముల పరిశీలించియో లేకయో ఏజీతనష్టముకో సస్పెండునకో రెకమెండ్ చేసి పంపబడినదని మరునాఁడే వుత్తర్వులు దిగబడుట ప్రత్యక్షము.

ఇక వుపాధ్యాయుని ఆదాయవిషయమై చెప్పఁబనిలేదుగదా! అందులో ఈకాలమున ప్రభుత్వమువారు గొప్పగా వేతనమిస్తున్నామని యనుకొనుచు ఒక హైయర్ గ్రేడు ప్యాసుఅయిన వుపాధ్యాయునికి రు 14 లు ఇచ్చుచున్నారు. అదియు గ్రాంటు బదులలో మూఁడు మాసముల కొకపర్యాయమని పేరుబెట్టి ఏడుమాసాలకో ఎనిమిది మాసాలకో ఇవ్వడము అనుభవం. అదియు పూర్తిగాచేతికివచ్చుటలో సందేహాలు. మొదటి తరగతి బాలబాలికల సంఖ్యలో 4, 5 తరగతులలో పాతికవంతు లేకుండిన గ్రాంటులో కోత తగిన వుపకరణములు, ఫర్నిచరు, లేకుంటే గ్రాంటులో కోత. అకస్మాత్తు విజిట్లలో గ్రహచారము తప్పేసరికి హాజరులేనిచో గ్రాంటులోకోత. కట్టడము అన్నివిధముల సౌకర్యమైనదిగాకుంటె గ్రాంటులోకోత

ఆటస్థలములేకుంటేనో, లేకచాలకుంటేనో గ్రాంటులోకోత. తోటకు తగుస్థలము లేకుంటే గ్రాంటులోకోత. గ్రామములో గల బాలికల జనాభాలో నాల్గోవంతు బడిలోలేని-చో రికగ్నిషన్ కేలోటు. ఈవిష యములలో కలిగేయిక్కట్లు దాటరానివి. అందులో క డ ప టి యిబ్బందినిగూర్చి ప్రస్తుతము వుపాధ్యాయులు, ప్రధానోపా ధ్యాయులు, మేనేజర్లుబడే కష్టాలుయింతింత గాదు. ఇన్ని కడగండ్లలో గడచి శైట పడేదెన్నాళ్ళకో ఈప్రాథమిక పాఠశాలో పాధ్యాయులు? ఇన్ని కోతలుపోను ఇఁక వుపాధ్యాయుల చేతికివచ్చుదానిని ఆలో చించవలసినవారు పాఠకులగు వుపాధ్యా యసోదరులే! ఇదిగాక సర్వీసురిజిస్టరుకల్గి వుండలేదని, బోధనోపకరణములతయారు చేయ అసమర్థుడని నేపాలు. వాస్తవంగా యివిమాత్రం వుంచుకోవలసినవే. ఇటు వంటిక్లిష్టపరిస్థితులలో వుపాధ్యాయుఁడేమి చేయవలెనో అగోచరము. ఇన్ని లోప ములు బడిలోనున్నను, వుపాధ్యాయుడు అసమర్థుడనిపించుకొనుచున్నను, గ్రాంటు మాత్రము పొందు వుపాధ్యాయుల అదృ ష్టమును కొనియాడ నెవరితరము? ఇంక గ్రామంలోగల్గిన పెద్దలప్రశ్నలకు సమా ధానాలివ్వటం అదియొక దుర్లభం?

"మావాడుఅన్నానికిపిలిస్తేరాలేదండీ! కాస్త భయంపెట్టాదండీ" అనియొకరు; "మావానికి కాస్త ప్రయివేటు చెప్పరా దండీ! రాత్రిళ్ల మాయింటికి పిల్చుకొచ్చి" అని యొకరు; "నాల్గోతరగతి కొచ్చినాడు బొండ్లు చదవటానికి రాదండీ? కాస్త చెప్పించరాదండీ" అనియొకరు, (బొండ్లు చదువుట' అనే పీరియడొకటి నిర్ణయించి యుండిన బాగుండేది.) "గుడ్డవృతికి కట్టు కోడండీ మాశిష్యుడు. కాస్త తెలివిచెప్ప రాదూ" అనియొకరు. "మావాఁడు వడ్డీ లెక్కలంటే దాగుకొంటాడండీ. కాస్త బాగుగా చెప్పియ్యరాదండీ" అని యొకరి ప్రశ్న. నాల్గునుండి 5 వ తరగతికి వచ్చీ రాకముందే జూన్ నెలలో "ఘనపరిమా ణముపై లెక్కలను బోధిస్తే మావానికి బాగుండును" అనియొక బడ్డె నానిరిపోర్టు. ఇట్టిప్రశ్నల కేయుపాధ్యాయుడు సమా ధానాలు చెప్పగల్గుతాడో తెలియదు. ఇంకవీరి సమాధానాల కుత్తరమిచ్చుచు వారిని మెప్పించే వుపాధ్యాయుడు నభూ తో నభవిష్యతి.

ఇఁక తల్లిదండ్రుల సంఘసమావేశాల్ని జరుపడంలో బ్రహ్మప్రయత్నం. మీాటిం గుకు మెంబర్లు మొదలుకొని కార్యదర్శి, ప్రెశిడెంటు మున్నగువారిని లక్షమార్లు గడ్డంబట్టి అడుక్కొంటె రావడం చాలా కష్టము. ఒకవేళ నిష్ఠూరముపై వచ్చిరి పోసిగరెట్టును కాలుస్తూ ఒకమూాల నిల్చుండేవాడొకడు. పాటలుపాడుతూ చలాయించేవాడొకడు. ఒకవేళ మనము ఆక్షేపణ చేసినామనుకొంటి "ఏమండీ యిందుకేనా తాము వచ్చి అంతగా పిల్చుకొని రావడం" అని అంటారు కొందరంకులో! ప్రెశిడెంటుగారిని కార్య దర్శిగారిని కుర్చీలపై కూర్చుండ నియో గిస్తే కూర్చుండడం కష్టం. చూచితిరా కష్టాలు! ఎవరికొఱకో ఈ సంఘాలు జరుపడం? ఏమైన తెలుసుకొంటారా ఈ అమాయకపు గ్రామస్థులు? ఎన్నియిబ్బంది లైనా అనుభవించి ప్రతిమాసంలో మాసాంత్యపు లెక్కలతో పాటు దీని

ఫలితాలను తప్పక పంపుకోవలె. లేకుంటే స్కూలు రికగ్నిషనుకు లోటుకల్గునని వార్నింగులు. "ఏమండీ, వారి కష్టసుఖాలు విద్యార్థుల విద్యా విషయాలు,పరస్పరంగా చర్చించేదానికి గదండీ ఈ మీటింగులు ఇచట జరుపడం" అని అనకముందే ఒక సభ్యుడు ప్రారంభిస్తాడు. ఈలాగు. "ఏమండీ పంతులుగారు! మావాడికీ ఏ జపానువారికథలో ఏ బర్మావారికథలో ఏ ఎస్కిమోల కథలో చెప్పుతారట. అది ఏలనంటే తిన్న తిన్నగా ఆ కథలు చెప్పి యుద్ధంలోకి లాగుకోడానికా? ఏమండీ! అట్లయితే రేపే మావానిని నిలుపుదలచేసి ఆవీధిలో వుండే కర్నంవీధి బడికి పంపిస్తానంటాడు." ఈవీధిబడుల వుపద్రవం ఒకటి ఈ గ్రామాలల్లో ఇంకో పెద్దాయన గొంతు చక్కజేసికొని "ఏమిటయ్యా పంతులూ? మాకుఱ్ఱాడికి ఏవో బొమ్మలు చూపుతారట! దాని పేరు వ్రాయమంటారుట! అదేమి పారాలండి. మా తాతలకాలంలో గూడా లేదే ఈ లాంటి చదువు. మీరు వ్రాస్తారా? నేనొక బొమ్మ తమకు చూపిస్తానంటాడు" (ఫ్లాషుకార్డుల విషయమై) ఇటువంటి సభ్యులను చేర్చి సభలను జరపవలెటీచర్లు. లేకుంటే ఇక్కట్లు. ఇన్నింట కడ తేరవలె ఈటీచర్లు.

తదుపరి మనవిద్యాశాఖావారి, నిబంధనలు చెప్పబనియేలేదుగదా. ఈరోజుండునది రేపులేదు. రేపుండునది మఱునాడు లేదు. అప్పటికప్పుడే వాటిని వుపాధ్యాయుడు ఆచరణలో వుంచవలె. దానిలో మన ఆలస్యాలుండకూడదు. వారిదుంటే వుండవచ్చు. దోషమేమిరాదుకదా! ఒక రిపోర్టు అధికారులనుంచి "అతిజరూరు" అనే ఎఱ్ఱసిరా అక్షరాలతో దిగబడుతుంది. అందులో "రెండురోజులలోగా ఈ ఆఫీసుకు వుత్తరం పంపుకోవాలి" అని వుండడం. అయితే అది చేరడం నియమిత కాలందాటిన మఱునాడు. ఈ బాధలు అధికారులకు తెలియవు. కాని మనం పంపుకొన్న వుత్తరం అక్కడికి చేరేసరికి దాని నక్లే త్రిప్పికొట్టి "సంజాయిషీతో పంపుకోవలెను" అని వ్రాసి పంపడం. చూచితిరా! ఇందులో అపరాధు లెవరో అనపరాధు లెవరో?

ఇక వ్రాతపనియా వుపాధ్యాయునికి తీరికయే అరుదుగదా! 8 గంటలకు బడి అయితే ఒక్కటిన్నర గంటముందే బడికి హాజరు కావలెనని హెడ్‌మాస్టర్లు, మేనేజర్లు, సహోపాధ్యాయులకు మెమోలు "రాత్రిళ్లలో ప్రతి బాలుని యింటికి వెళ్లి వారి తలిదండ్రులతో ముచ్చటలాడి రావాలి. లేకుంటే చెడ్డ పేరు సంపాదిస్తారు. అనియొక మెమోబడివుండే గ్రామంలోనే నివసించాలి అని అధికారుల ఆజ్ఞ. అందుపై మేనేజర్లు హెడ్‌మాస్టర్లు చేసే చలాయింపులకు మితియే యుండదు. అయితే నెల సంబళాలు మాత్రం పుజ్యం. ఏ ఆరునెలలకో 9 నెలలకో జీతాల బట్వాడా. అదీ అరా కొదువగనే. పూర్తిగా యిచ్చెస్తే ధన్యులైపోరూ ఉపాధ్యాయులు! అన్ని వ్రాతపనులు-యావద్విశిష్టల సహోపాధ్యాయులు చేసుకుపోతూంటే "మా అసిస్టెంటులాంటి వారింక మన గ్రామానికే రాడండీ" అని ఇతరుల దగ్గఱ పొడద్తలు. ఏ సమయంలోనైనా అడ్డు దిరిగితే చాలు. ఇక

కదలించేదానికి ఆలోచనలు. ఇతర వుపాధ్యాయులతో, అధికార్లతో, క్రొత్తగా వచ్చేవారినైనా క్రమంగా చూస్తారా? ఎక్కడిదీ ఏకొద్ది రోజులవఱకో మాత్రమే అతనితో విహితం తర్వాత యథాప్రకార సిద్ధిరస్తు. ఇట్టి స్థితిలో తెల్లవారుచున్నది మేనేజర్లు. హెడ్‌మాస్టర్ల-నిర్వాహణం. వారికేమాత్రం వ్యతిరేకిస్తే ఎక్కడలేని దోషాలు ఆరూపణ జేయడంలో నిపుణులు ఈకాలపు మేనేజర్లు. ఈ గండాలలో అంతా గడచి బైటబడే దేనాటికో వుపాధ్యాయుడు! ఒకప ర్యాయమునకు 10 మార్లు బాలుని బడికి రమ్మని పోయి పిలవడం బాగా ఆచరణలోనికి దెచ్చి పెట్టుకొని స్థాపించుకొని యున్నారు. అప్పటికాలపు టీచర్ మేనేజర్లు తలిదండ్రులలో దురభిప్రాయాలు-మనపిల్లవాణ్ని పంపకుంటే అయ్యవారికి జీతాల బట్వాడా ఆగిపోతుందేమో అని. ఇంకొకరింటికి పోతే. "ఏమండీ గుడ్డలులేక బడికి రాగూడదంటారట! పొట్ట కూటికే యిక్కట్టుగానున్నదే కట్టు గుడ్డకేంజేయమన్నారండీ" అంటూ యిష్టముంటే పిల్చుకెళ్లండి లేకుంటే వద్దు అని బెదరించడం. ఇంకో పెద్దమనిషి "ఏమిటి పంతులూ! మాలవాళ్లు మనమూ అంతా ఒకటిగా కూర్చుండవలసిందేనా? కాస్త దూరంగా కూర్చుండ పెట్టరాదూ మా అబ్బాయినిమాత్రము" అని అధికారాలు ఇన్ని చీవాట్లు తినవలసిందే, టీచర్లు మేనేజర్లు చేసిపెట్టిన అలవాట్లకు గురి అయితే.

ఇన్ని యిబ్బందులు పడుచున్న వీరికి ప్రభుత్వమువారు క్వార్టర్లీ గ్రాంటని ఏర్పాటు చేసిరి. మహానంద మైంది టీచర్ మేనేజర్లకు ఇప్పటి వ్వటీ గ్రాంట్లు 9 మాసాలదాక వచ్చేదగుదు. కొన్ని పాఠశాలలకు 1941 వ సంవత్సరపు మొదటి క్వార్టరు గ్రాంటు ముట్టలేదు. అయితే రెండుమూడు క్వార్టర్ల గ్రాంటు మాత్రము ఏకొద్ది నెలల ఆలస్యంతోనో చేరినవి. మొదట క్వార్టరు గ్రాంటు విషయం విద్యాధికార్లకు విన్నవించుకొంటే ప్రత్యుత్తరంసున్న. బహుశః అది చేరియుండదేమోనని నుసవుత్తరాన్ని రిజష్టరుచేసి పంపుకొంటే దానికి కూడ యిది వఱకు ప్రత్యుత్తరం సున్న అంతే మొత్తంమీద ఏకమూసాల గ్రాంటు ముట్టనట్లె ఆబడికీ తేదీకి. ఏ దేవుని ప్రార్థించ మంటూరు ఈ ఆపదతీరేందుకు? అప్పుల వారా యింటి చుట్టూ తిరిగి పీకేస్తున్నారు. వారిటువంటి సమాధానాలు నమ్మరు. మేనేజర్లు, టీచర్లు కలసి రహస్యంగా మ్రింగేశారని వారి నమ్మిక. ఇందు విషయమై బాగావదంతులు పుట్టించటానికి ప్రారంభిస్తారు. గ్రామస్థులు. ఆగ్రాంటుపైననే ఆధారపడి యున్నారు. వేరేవిధమైన ఆదాయంలేక పోయె క్షామంబాగా దాపరించుకొని వుంది గ్రామాదుల్లో. మేనేజరులను పీడిస్తామంటే వారూ నిరపరాధులు. మేనేజర్లు పూట గడపుకొనుటకూడ కష్టమే. సామానుల ఖరీదులా నానాటికి మితిమీరి పోతున్నవి. రాసులు, కంబులు (సజ్జలు) జొన్నలు, బియ్యములకు కూడాయుద్ధం వెలలు. తప్పుడు, గానుగ పిండికి గూడ యుద్ధం వలన వెలలు పెరిగినాయంటారు. ఈకాలకములో వుపాధ్యాయులు, అందులో ఈ గ్రామాదుల్లో ఏవిధంగా వారి కూడుతిని వృత్తిని సక్ర

మంగా నెరవేర్చగల్గుతారో నాకు తోచ కున్నది.

ఇటువంటి కష్టముల కంతాటీచర్లు గురిగాకుండా చూడవలెనంటే ప్రభుత్వము వారి కరుణార్ద్రదృష్టి ప్రాథమికోపాధ్యాయులపై బఱపుటుచితము. వారికి గ్రాంటై నను జీతమైనను సకాలములో చేర్చగల్గుటకు ప్రభుత్వమువారు శీఘ్రముగయత్నించుచుదురని ప్రార్థించుచున్నాను. బడులకు వసతియగు నిండ్లను గ్రామాల్లో సమకూర్చవలెను. నిర్బంధ విద్యను అమలు నందుంచవలెను. తగుఫర్నిచరునకు సిపార్సు చేయవలెను. అర్హులు, అనర్హులను, గమనించి వుద్యోగము లిప్పించవలెను. పాఠశాలలలో పలుతెగలులేక ఏఒకరి అధిపత్యం క్రిందనే నడపించునట్లు ఏర్పాటు చేయుటు చితము. అదేవృత్తిని నమ్మియున్నారము. ప్రభుత్వమువారు పైకనిన సౌకర్యములు ప్రాథమికోపాధ్యాయులకు కల్గించకున్న కూడిన శీఘ్రములో వాటియాశ నిరాశయగుటకే సందియమును కానరాదు. కష్టనిష్ఠురాలను నివేదించుకొన్నందులకు క్షమాపణ.

కావున నో ఉపాధ్యాయ సోదర సోదరీ మణులారా! మేల్కొనుడు. ప్రభుత్వమువారికి మీమీ నష్టముల నివేదించు కొనుడు. అందేతప్పనులేదు. వార్తాపత్రికలు మాగజైనలు మున్నగు నవి ప్రజల కష్టాలను ప్రభుత్వానికి, పరులకు తెల్పుకోడాకే నిర్ణయించబడినవి. మన స్నేహిత బృందమును ప్రోత్సహించుడు వేగిరపడుడు. మన మానవులను "ఆంధ్ర రాష్ట్ర ప్రారంభవిద్య" మేనేజరుగారు, ఈ మాసపత్రిక ద్వారా ఎల్లరకు తెలియ బరచెదరు. అందుకే సందియమునులేదు. దిక్కులేని ఈ ప్రాథమికోపాధ్యాయులను ప్రభుత్వమువారు రక్షిస్తారు. మనకే విధమునను ఈపత్రికసాయపడును. మన కష్టాలను ప్రభుత్వం గమనిస్తుంది. శంకలేదు. ఎందుకింకను వూరకున్నారు? ఊరక మూలలలో నొదిగియుండుటచే లాభములేదు. గమనించుడు. ఇంతటితో చాలించుచున్నాను.

---

# హిందూ దేశ చరిత్ర

5 వ త ర గ తి

(Copy-right to the authors)

(జనవరినెల సంచిక తరువాయి)

వేదుల అన్నయ్యశాస్త్రి,
హెడ్మాష్టరు - బోర్డుస్కూలు, గురమ్మపాలెం (విశాఖపట్టణం రేంజి)
తాతా జగన్నాధరావు,
హెడ్మాష్టరు బోర్డుస్కూలు, సొంర్యాం (విశాఖపట్టణం రేంజి)

Syllabus Heading —Chandragupta Maurya and Chanakya.

1. చంద్రగుప్తమౌర్యున కాపేరెట్లు వచ్చెను? యితని తండ్రిపేరేమి?

జ: ముర కుమారుడు చంద్రగుప్తుడగుటచేత ఇతనిని చంద్రగుప్తమౌర్యుడని పిలుచుచుండిరి. యితని తండ్రిపేరు మహాపద్మనందుడు.

2. చంద్రగుప్తుని అడవులపాలు ఏకారణమువలన ఎవరు చేయించిరి?

జ: చంద్రగుప్తుడు తెలివిగలవాడును బుద్ధిమంతుడగుటచేత ప్రజ లితనిని గౌరవించుచుండిరి. రాణి యిది ఎరిగి తన కుమారులగు నందులకు ముందపకారము గల్గునని భయపడి చంద్రగుప్తుని యడవుల పాలు చేయించెను.

3. చాణుక్యు డెవరు? ఆతడు పూనిన ప్రతిజ్ఞ ఏమి? అందులకు కారణమేమి?

జ: చాణుక్యుడు బ్రాహ్మణుడు. యితడు నందవంశమును నాశనము చేతునని ప్రతిన బూనెను. యితని నందులు సభలో అవమానపరచుటయే యిందులకు కారణము.

4. సెల్యూకస్ ఎవరు? యితడు చంద్రగుప్తున కేయే రాజ్యములనిచ్చెను?

జ: అలగ్జాండరు మన దేశములో జయించిన ప్రదేశములకు రాజప్రతినిధిగానున్న గ్రీసు సేనానియే సెల్యూకసు. యితడు బెలూచీస్థానము, హీరటు, కాబూలు, కందహారు రాజ్యములను చంద్రగుప్తున కిచ్చివేసెను.

5. చంద్రగుప్తుని భార్య ఎవరు?

జ: సెల్యూకస్ కుమార్తె.

Syllabus Heading:— Mauryan Empire; administration, edicts.

1. మౌర్యుడు తన పరిపాలనా సౌకర్యముకొరకు రాజ్యమును ఏయే పరగణాలుగా విభజించెను? వాటి కేంద్రస్థానము లేవి?

| | | | |
|---|---|---|---|
| జ: 1. పశ్చిమోత్తర రాష్ట్రము | ... | తక్షశిల | (కేంద్రస్థానము) |
| 2. పశ్చిమ రాష్ట్రము | ... | ఉజ్జయిని | ,, |
| 3. కళింగ రాష్ట్రము | ... | తోసలి | ,, |
| 4. దక్కను | .. | స్వర్ణగిరి | ,, |

2. రాజునకు కేంద్రస్థానమేది?

జ: పాటలీపుత్రము.

3. మౌర్యుడు కేంద్రమందును, రాష్ట్రములందును ఎన్ని పంచాయతీలను ఏర్పాటుచేసెను? అవి ఏవి?

జ: ఆరు పంచాయతీలను ఏర్పాటు చేసెను.

1. పరిశ్రమలను వృద్ధిచేయుటకును,
2. జననమరణముల లెక్కలు వ్రాయుటకును,
3. వర్తకమునందు మోసము జరుగకుండుటకును,
4. వర్తకసంఘమునకు సహాయము చేయుటకును,
5. పన్నులు వసూలు చేయుటకును,
6. విదేశీయులను సన్మానించుటకును పంచాయతీలను ఏర్పాటు చేసెను.

4 మౌర్యుని కాలమున పన్నులు వేటిపై ఎంతెంత వసూలుచేయబడి ఆధనము దేనికి వినియోగపడుచుండెను ?

జ. మౌర్యుని కాలమున పంటలో 1/4 వంతును, వ్యాపార ఆదాయముల మీదను, అడవులు, గనులు, మత్తుపదార్థములమీదను పన్నులు వసూలుచేయబడెడివి. యీధనముతో రోడ్లు, చెరువులు, నూతులు, కాలువలు, వైద్యశాలలు మొదలగు వాటిని ఏర్పాటుచేసిరి

5. మౌర్యునికాలములో శిక్షలెట్లుండెను ?

జ: కొట్లు, తిట్లు, దొంగతనము కూడా పంచాయతీలద్వారానే పరిష్కరింప బడుచుండెను. నేరస్థుల జాతి గౌరవములనుబట్టి శిక్షలు విధించుచుండిరి. చిన్న దొంగ తనముచేసిన వారికిగూడ ఉరిశిక్షలు విధించెడివారు. మొత్తముమీద వీరిశిక్షలు కఠిన ముగానే యుండెడివి.

Syllabus Heading —The Pallavas, cheras, cholas, Pandyas, Their Supremacy.

1. పల్లవులరాజ్యము ఎచ్చటనుండి ఎంతవరకు వ్యాపించియుండెను ? వారి రాజధానియేది ?

జ: పల్లవుల రాజ్యము మంచిదశలో నున్నప్పుడు కృష్ణానది మొదలు కావేరి వరకు వ్యాపించియుండెను. వీరిరాజధాని కాంచీపురము.

2. పల్లవు లేయేశాస్త్రములను, భాషలను పోషించిరి ?

జ: వీరు శిల్పశాస్త్రమును, అరవ, సంస్కృతభాషలను పోషించిరి.

3. పల్లవరాజులలో ముఖ్యులెవరు ? వారిని గూర్చి క్లుప్తముగ వ్రాయుము ?

జ. పల్లవరాజులలో మహేంద్రవర్మ, నరశింహావర్మ, చినస్కంధవర్మయుముఖ్యులు.

1. మహేంద్రవర్మ :- మత్తవిలాసమను ప్రహసన నాటకమును సంస్కృతము నరచించెను.

2. నరశింహావర్మ :- చేర, చోళ, పాండ్యరాజులన జయించి కీర్తిపొందెను. పశ్చిమ చాళుక్యులను జయించి వాతాపి కొండయను బిరుదు పొందెను.

3. చినస్కందవర్మ :— పలువురు రాజులను జయించి అశ్వమేధయాగమును చేసెను.

4. పల్లవులు తుదకు ఎవరిచే నోడింపబడిరి ?

జ: చోళరాజులచే నోడింపబడిరి.

5. చేరరాజ్యమనునది ఏది ? దీనికి మరియొక పేరేమి ? యీ రాజ్యమునకు రాజధాని ఏది ?

జ: పడమటి తీరమున నిప్పటి తిరువాన్కూరు, కొచ్చి, మలబారు ప్రదేశములు చేరి చేరరాజ్యమని పిలువబడుచుండెడిది. దీనికి కేరళరాజ్యమని మరియొక పేరు గలదు. దీనికి వంజన నగరము రాజధాని.

6. చేరరాజులకు గల బిరుదేది? వారి ఆది పురుషుడెవరు?

జ: వీరికి మలయమాన్ అను బిరుదుగలదు. వీరి ఆది పురుషుడు అదుడు.

7. కేరళవర్మయను రాజెవరు? ఇతడు రాజ్యము నెక్కడ స్థాపించెను? రాజధాని ఏది?

జ: చేరరాజ్యమును కాంగులు అనువారు ఆక్రమించుకొనగా వీర కేరళవర్మయను రాజు యిప్పటి తిరువాన్కూరు రాజ్యమును స్థాపించెను. దాని రాజధాని తిరువాన్కూరు.

(సశేషము)

---

# బాలభటుఁడు

శ్రీమాన్ కొ. వేం కృష్ణమాచార్య.

నీతిలేనివాఁడైనచో నింద సేతు
రెల్లవారలు విద్వాంసు నెప్పుడైన;
గాని పూజింత్రు విద్యావిహీనుఁడైన
నీతికోవిదు, దమ్ముఁడా! నిజమునిజము.

దేవ రాజ భక్తులను, స్వదేశభక్తి,
పుడమి నుపకార మొనరించు బుద్ధినేర్పి
పోరి, బాలురకు సుగుణబోధఁ జేయు
నుద్యమంబిది బాలభటోద్యమంబు.

దేహసామర్థ్యమునుఁగల్గి తేజరిల్లు
బాలభటశిక్ష నిపుణతల్ బాగుమీరఁ
బరులకుపకార మొనరించు బాలభటుఁడు
యెల్లవేళల శంక లేకుల్లమందు

ప్రభువు రాబర్టుబేడెను పవలుగారు
స్థాపితంబొనరించిన సంస్థయిదియె!
ఎనిమిదేడులు మొదలు పదునెనిమిదేండ్ల
వరకునున్న బాలురు చేరవచ్చునిందు.

కాలకర్మానతగిలిన గాయములకు
జ్వరము మొదలగువానికి శాంతినిచ్చు

ప్రప్రథమ చికిత్సలును తంత్రములు నేర్పు
నుద్యమంబిది బాలభటోద్యమంబు.

సంఘమునఁ జేరఁదలఁచిన సదయుఁడెవ్వఁడుఁ
దొలుతఁ బాత్రతఁబడయంగవలయుఁగాన
దినము ముప్పది కఠినపరీ దీక్షలమని
బాలభటశిక్షణముఁ బొందఁబాడియగును.

'త్రికరణంపుశుద్ధి, దేవదేవు నెడల,
యేలిక యెడ, దేశమెడల, నేను,
నడచుకొనగవలసిన నయములెల్లను
నలుపఁజూతునెపుడు శక్తికొలఁది.

'ఇప్పుడప్పుడనక యెల్ల వేళలయందు,
పరులకును సహాయపడెడువాడ
బద్ధుఁడనయి బాలభట ధర్మములనెల్ల
నాచరింతుఁజేత లాత్మలందు'

'నమ్మవచ్చు బాలభటుని, న్యాయమార్గ
మందునడతునెప్పుడ' నెడుమాటలకుది
వ్రాసి; పఠియించి, జీర్ణింపజేసికొంటి,
నట్లె నడతు మనోవాక్కర్మలందు భువిని.

'తల్లిదండ్రుల యెడలను దైవమెడలఁ,
బ్రభువు లధికారులెడభక్తి భయముగల్గి
చెలిమికాండ్రతో వర్తింతుఁగలసిమెలసి,
శత్రులకునుఁదోడౌదుఁ గష్టాలలోన.'

'ధరపరోకారార్థమిదంశరీర
మనెడు నార్యోక్తిమదినెంచి మనుచునుండుఁ
దోడునీడౌదుపరుల కీడులందుఁ
గష్టసుఖములుఁ దలఁపక గలలనైన.'

'పరులనెల్లరఁగడు మిత్రభావమునను
బాలభటులను సోదరభావమునను
ధనదుల నిరుపేదల సమాదరణదృష్టిఁ
జూతునే కాని వేరుగాఁ జూచుటెరుఁగ.'

'జాతిమతభేదములులేక సఖులయెడల
సర్వసోదర భావాన సంచరింతు,

బీద, ముసలి, రోగులను సేవించుచుందు,
మాతలంచును భావింతుమగువలమది.'

"ఆత్మవత్సరభూతాని" యనెడు పల్కు
నిక్కువంబొనరింపఁగా నిఖిలప్రాణి
కోటిఁ బ్రేమించి కష్టాల గోతినుండి
*రక్షణముఁ జేతు శ్రీరామ రక్షయనుచు.'

'ఘోరకష్టంపు సమయాలు కూడియున్న
సరియె, బాలభటుఁడ, నిరుత్సాహిగాను,
ఎట్టికష్టంపుఁబనులను పట్టుఁబట్టి
సలుపయత్నింతుఁ బరమయుత్సాహినౌచు.'

'కాసువీసము మొదలు రాఁజేసియుంచి,
దాతు, వృద్ధిగావింతు, నేదాసి బ్యాంకుఁ;
సరిగసంపాదనములేని సమయమందు,
నుదరపోషణార్థమది యుపయోగపడును'

'గురువుల జననీజనకుల
గురుశమలచరణములేయగు శరణమని నీ
ధరణినిగొల్చి తదాజ్ఞల
శిరసావహియింతు, మారుఁజెప్పక నెపుడున్.'

'శుద్ధుఁడను, వాఙ్మనఃకాయ శుద్ధితోడ,
నొరులుదూషింప, మార్వల్క; నోర్పుమీర,
జనదుసామాన్యమగు దుస్తులనుధరించి,
పౌరుషమె స్వభూషణము నీభటునికెపుడు.'

'ఖాదితో, నరచేతిచొక్కాయు, పొట్టి
లాగు, మెడనురుమాలు బల్‌లావుపాటి
కట్టి, పాదరక్షలును బిగిలును, బెల్టు'
పాగఁ, దలనుధరించు నీబాలభటుడు.'

'సైసికిల్ త్రొక్కు, టీదుట, పరువులిడుట,
*ఓ
మొదలు నత్యంతముపయోగములు ప్రథమచి
కిత్సలాదిగాఁదెలిసి శంకించనట్టి
జీవనము సంఘసేవకు జీవగఱ్ఱ.'

'శాంతమూడు నిప్పుల్లలు మండబెట్టి
చిన్న చిన్న చిదుగులతోఁ జిచ్చుఁజేయ

కొన్ని సులువు పదార్థాలు అన్న మాదిరి
వండగల నేర్పు వానికి నుండవలయు.'
'విధులఁదీర్చిన విశ్రాంతివేళలందు
వడ్రమునుంజేయుటో, నూలువడకి, చేత
నేతనేయుటో, ఛాయాపటాల్ తయారు
చేయుటో, మొదలగుపనుల్ చేయవలయు.'

---

## తెలిసికో!

[పి నారాయణయ్య - మేర్లపాక]

ప్రభుత్వమువారి విధులెట్టు లుండినను, తెల్లవారినుండి సాయంకాలము వఱకు, విరామములేకుండా బడిలో పనిజేయవలసినవాఁడు పల్లెటూరి బడిపంతులు. తన వేతన సౌష్ఠవమును సరకుగొనక, తన యాలుబిడ్డల సుఖమును గమనించక, సుహృద్భావముతో బాలురసేవయే భగవంతుని సేవ' యని నమ్మి కష్టపడి పని జేయవలసినవాఁడు బడిపంతులు. బళ్ళ తనిఖీ యుద్యోగస్థుల సగౌరముగ మర్యాద జేయవలసివాడు బడిపంతులు. అప్పుడప్పుఁడాగంతుకముగ విచ్చేయు యుద్యోగస్థుల బడిపంతులు పలుకరించకున్న ఆ గ్రామములో వారిని గౌరవించువారరుదు. అట్టియెడ ఆదరించిన అయ్యవారినే అణగద్రొక్కుట కుద్దేశింతురు మన విద్యాధికారులు. అట్లని అయ్యవార్ల తప్పుల నొప్పులుగా పరిగణించమనుట నావాదము గాదు. తనిఖీ పుస్తకముపై కలముపెట్టినదిమొదలు అధికార్లకు తప్పులే యగపడుచుండును. పాఠశాల నెంతయభివృద్ధిలోనికి దెచ్చి బాగుల వ్రాయునధికారిని నేనిప్పటికి జూడలేదు. ఉన్నదున్నట్లు వ్రాయక ఓగులు కనుగొనుట మాత్రమే తన విధి యనిన ఉపాధ్యాయులకు ప్రోత్సాహమెట్లు కలుగును? పనిజేయు వానిని ప్రోత్సాహించిన గదా! తన శక్తిని యింకను ద్విగుణీకరించి పనిజేయ సమకట్టును! అదిగాక ఎంతపొద్దు కాడలేచిన మొదలు కాడినే తెల్లవారిందనే సామెత ప్రకారం ఎంత కష్టపడి పనిజేసినా మన కొచ్చేది యీ రిమార్కే గదా యనేఅభిప్రాయం మనస్సున నాటితే మరల కష్టించుటకు ఉత్సాహం కలుగుతుందా? నిరుత్సాహం కలుగుతుందా? ఆలోచిస్తారా? కాబట్టి తప్పుల బట్టుటే తన ధర్మమనుకొనకుండా కడుపుపై గొట్టుటే తన కర్తవ్యమను కొనకుండా చీవాట్లు బెట్టుటే తన అధికార సామర్థ్యమను కొనకుండా యే విద్యాధికారి ఉపాధ్యాయుల ప్రోత్సాహించునో యతఁడే విద్యోద్ధారకాధికారి. ప్రారంభ విద్య బాగుపడాలంటే పంతుళ్ళను ప్రోత్సాహించుటే పరమనీతి. "ఊ" అంటే కోత "ఆ" అంటే కోత అంటే అంతటిలోనే ఉంటుంది. ఆ యుపాధ్యాయులకు తన వృత్తిపైని యభిలాష. [మిగత యీసారి]

---

# ఆరోగ్యశాస్త్రము

## దంతములనుగురించిన జాగ్రత

వేదుల సూర్యనారాయణశాస్త్రి

పండ్లు పాడయిపోకుండ సంరక్షించుకొనుట మనకు ముఖ్యావసరము. మన శారీరారోగ్యమంతయు దీనిమీదనే యాధారపడియున్నది. అందుకుగాను మనము చేయవలసినదేమి ? బహుశః పండ్లసందులలోను, పండ్లయొక్క చుట్టును మనము తినునట్టి యాహారమునందలి పదార్థములంటుకొని యుండుటయే పండ్లుచెడిపోవుటకు ముఖ్యకారణము. పిండిపదార్థ సంబంధమగు తినుబండములు, ఆహారపదార్థములు, యివి పండ్లకు అపాయము గలిగించుచున్నవి. అవి జిగురుగలవియై పండ్లకు గట్టిగా అంటుకొనును. పండ్లయందుండు జిగురుపదార్థములను ఫలములు శుభ్రము చేయును కావున భోజనానంతరమందున ఫలములు తినుటమంచిది. ఇనుమునుత్రుప్పు తినివేయునట్లుగా పండ్లచుట్టును, మధ్య యున్న మలినపదార్థములు పండ్లను తిని వేయునుగాన పుప్పిపండ్లు పుట్టును. భోజనానంతరమునందు నీటిని బాగుగా బుక్కిలించి నోరు కడిగికొనవలయును. ఇందువలననే స్కాంద పురాణమందలి ధర్మఖండమున భోజనమునకు పుర్వాపరములందు ద్వాదశ గండూషములు విధింపబడియె. మిక్కిలి చల్లనివస్తువులు, ఎక్కువ వుల్లని వస్తువులుగాని తినినయెడల పండ్ల పై భాగమునగల పింగాణీవంటిపొర పాడై పోగలదు. గట్టిమాంసము నమలుటకు ప్రయత్నించినప్పుడు ఆ మాంసలేశములున్న పోక చెక్కలు కొరుకునప్పుడు, గట్టికాయలు కొరికినప్పుడు వానియందలి నలుసులు పండ్లసందున యిరికికొని పండ్లకు హానికలుగ చేయును. కావున ప్రతివారును పండ్లను గురించి బహుజాగ్రత తీసికొనవలయును. అందుకుగాను ఉపాధ్యాయులు తమతమ పారశాలలయందలి విద్యార్థులకు యీ విషయములు నేర్పుట, అట్లుదానిని ఆచరించునట్లుచేయుటయందు తగుశ్రద్ధ తీసుకోవలసిన వారగుచున్నారు.

### —: దంతములు శోధించుట :—

ఇది దృష్టఫలము, అదృష్టఫలమును కలుగజేయునని ఋషి వచనములు గలవు. దంతకాష్ఠము పండ్రెండంగుళములుపొడవు, చిటికెనవ్రేలితో సమమగు లావునుగలిగి, పుప్పిలేనిది, క్రొత్తది, మంచిభూమియందు బుట్టినది, బేసిగుంపులుగలదియు యగుదానిని తీసుకొనవలయును. గాని ఋతువును, దోషమును, రసమును, వీర్యమునుయోజించి' గ్రహించవలయును. వగరు, చేదు, మధురము, కారముగల దంతకాష్ఠముచే దంతధావనము చేయవలెను. చేదుగలవానిలోనికి వేపపుల్లయు, వగరుగలవానిలోనికి చంద్రకాష్ఠమున్ను, తీపుగలవానిలోనికి ఇప్పపుడకయు, కారముగలవానిలోనికి కానుగపుడకయు శ్రేష్ఠము అయినవి.

వాకుడుగింజలు, శొంఠి, పిప్పలి, మిరియము, కరక, తాడి, ఉసిరిక, నూనె,

సైంధవలవణము యివి యన్నియు చూర్ణముచేసి, దంతముల నొక్కొక్క దానిని, వేరువేరుగా దంతముమీది మాంసమును బాధించకుండా యీ చూర్ణమును కుంచెతో అద్ది దంతములను తోమినఎడల వాటి దౌర్గంధ్యము పోవుటయేగాక శ్లేష్మము హరియించును. ముఖమునందు స్వచ్ఛత యేర్పడును. అన్నమందు రుచిగలుగును. మనసు స్వచ్ఛమగును. కంఠ తాల్వోష్ఠ జిహ్వారోగములు అంతరించును. ముఖరోగము, శ్వాస, కాస, ఎక్కిళ్లు, వమనము, నీరసము, అజీర్ణము, మూర్ఛ, బద్ధకము, శిరోరోగము, విదాహము, అలసట, పానముచేనగు శ్రమ, కర్ణశూల, దంతరోగము ఇవిగలవారు పైవిధముగా దంతధావనము జేయవలయును. ఇట్లు చేసిన యారోగ్యకరము. బంగరు బద్దతోనయినను, వెండిబద్దతోనయినను, ఆవృక్ష సంబంధమగు బద్దతోనయినను, నాలుకనుగీసి యాపాచిని దీసిపారవేయవలెను. ఇందువలన ముఖమందలి అరుచి, దౌర్గంధ్యము మొదలగునవి నశించును. మసి బొగ్గుచూర్ణములో కొలదిగా సైంధవ లవణము జేర్చి దంతధావనచేసినచో పండ్లనుండి రక్తముగారుట నివారణయగును. కొంచెముప్పుచేర్చిన గోరువెచ్చని నీటితో గండూషము జేయవలయును. పాలచెట్లు కషాయముతోనయినను, నేలవేము లేక నట్టివేళ్లు, ఉసిరిపప్పు, వీనికషాయముతో పాలుగలిపి గండూషముజేసిన దంతదార్ఢ్యము హెచ్చగును, రుచిబుట్టును. ముఖమును నేత్రములను, చల్లనిజలముచే కడిగినచో పుసి, ముఖశోషము, ముఖమునందలి పొక్కులు, రక్తపిత్తమును హరించునని శుశ్రుతమందు చెప్పబడెను.

---

# ప్రపంచము - సహజమండలములు

వేదుల అన్నయ్యశాస్త్రి, హెడ్మాష్టరు - బోర్డు ఎలిమెంటరీస్కూలు, గురమ్మపాలెం.
తాతా జగన్నాధరావు, హెడ్మాష్టరు - బోర్డు ఎలిమెంటరీస్కూలు, సాంర్యాం,

[రచయితల అనుమతిలేనిదే యీపాటను ఇతరులు ప్రచురింపరాదు]

("గోదావరి పుష్కరాల వింతలు" అను వరుస)

1. వరల్డ్ సహజమండలములవింతలు - బాబు ॥వరల్డ్॥
వరుసగాను మేమిప్పుడు వర్ణించెదమండివేగ ॥వరల్డ్॥
2. వివిధమండలములయునికి - వాటి లక్షణంబులు మరి
శీతోష్ణస్థితిగతులును - ప్రజల జీవితంబులుప్ర - ముఖ్యమైన భాగంబుల
పరిచయంబు నేడు మీకు - కలిగింతుమువేగ వినుడు ॥వరల్డ్॥
3. మంచుమెడార్లుండి బాబు - ఉత్తర దక్షిణ ధృవముల
ప్రాంతంబుల డెబ్బదిపైని - దవ డిగ్రీనుండి యుండి
చలి మిక్కుటమగుటచేత - చెట్లు చేమ లేమిలేక

సీలు తిమింగలములాది - జలచరముల వేటాడుచు
గ్రీన్లాండు పరిసరముల - ఎస్కిమోలు జీవింతురు ॥వరల్డ్॥

4. టండ్రాభూములు బాబు - అరవై యైదు డిగ్రీ
ఐదవడిగ్రీమధ్య - యూరేషియా అమెరికాల - కుత్తరభాగమున గలవు
వేసవి తక్కువబాబు - చలికాలము దీర్ఘమండి
లిచ్చెన్సు మొదలైన - స్వల్ప మొక్కలుంటాయి
సీలు తిమింగలములాది - జలచరముల వేటాడుచు
రెయిన్ డీరులను పెంచి - స్లెడ్జిబండ్లు లాగించుచు
ఉత్తరమెరికా యంతను - నార్వే స్వీడను మరియు - రష్యాసైబీరియాల
ఎస్కిమోలు లాప్పులు ఫి - న్నోస్టియాక్సులనువారలు
క్రమముగాను జీవితములు - గడపెదరండీ బాబు ॥వరల్డ్॥

5. కోనిఫెరస్ ఫారెస్టులు - ఏభై ఐదవ డిగ్రీ
నారంభము చేసుకొని - సమశీతోష్ణస్థితిని
ఇరువదంగుళముల రెయిన్ - కారణమున పెగాయను
యడవులచే సౌతు జర్మనీ - స్విట్జర్లాండు దేశ
ము త్తరమెరికా యందలి - వాయువ్యతీరమందు
బీవ, రెక్కూనీసు, మింక్సు - సేబిలులను వేటాడుచు
కలప నరకు చుందు దురీ - మండల ప్రజలండి బాబు ॥వరల్డ్॥

6. డెసిడ్యుయస్ ఫారెస్టులు - నలభై ఐదవడిగ్రీ - నారంభముచేసుకొని
సౌమ్యమైన శీతోష్ణ - స్థితిగతులను గల్గిబాబు
యూరపుఖండమునందును - యు. యస్. ఎ. రాష్ట్రమంద
లీశాన్యమునందు మరియు - చిల్లీ దక్షిణభాగము
నందు బీచి, బర్చు, యల్మ్ - మ్యాపిలు చెట్లున్నాయి
అందలిమానవులు బాబు - కలప వృత్తిచేసెదరు
చేపలవేటాడి వారు - పరిశ్రమలు వృద్ధిపరచి
ప్రాపంచకమందు మిగుల - పేరెన్నిక గన్నారు ॥వరల్డ్॥

7. టెంపరేటు గ్రాసులేండ్సు - థర్టీ ఫార్టీఫైవు - డిగ్రీలనడుమనున్న
యూరేషియా ఖండమందు - తూర్పున మంచూరియాలో
ఆస్ట్రియ హంగేరీలలో - స్టెప్పీలను గడ్డిబీళ్లు
ఉత్తరమెరికాయందు - రాకీపర్వత తూర్పు
భాగమందు ప్రయరీలను - గడ్డి బీడులున్నాయి
దక్షిణ మెరికాలోన - అర్జంటైనా మరియు
ఉరుగ్వే భాగముల - పాంపాసులను బీళ్లు

దక్షిణాఫ్రికాయందు - ట్రాన్సువాలు ఆరంజీ - రాజ్యంబుల వెల్డులను
గడ్డి బీడులున్నాయి
ఆస్ట్రేలియాలోన - న్యూసౌతు వేల్సునందు - డౌన్సులనే గడ్డిబీళ్ల
పశువులను మేపుచును - పాలువెన్న మాంసములను - పై కెగుమతిచేయుదురు
గొర్రెలను మేకలను - గుర్రములను మేపుచును
వ్యవసాయముచేయు జనులు - వసియించుచున్నారు ॥వరల్డ్॥

8. ఉష్ణమండలపు ఎడా - ర్లింపుగ ఇనువది మొదలు
ముప్పది డిగ్రీలవరకు - యూరేషియ ఖండమందు-అరేబియ, గోబీ, థార్
ఆఫ్రికఖండమునందు - సాహారా, కలహార
ఉత్తరమెరికాలోని - కలరేడో డీజర్టు
దక్షిణమెరికాలోని - అటకామా ఎడారి
ఆస్ట్రేలియ ఖండమందు - పశ్చిమఎడారులందు
స్వల్పవర్షపాతముచే - చెట్లుచేమ లేమిలేక
ఓయాసిస్‌లోనినీరు - ఒప్పుగ ద్రాగెదరువారు
ఖర్జూరము వర్తకంబు - ఒంటెలపై చేసెదరు ॥వరల్డ్॥

9. ట్రాపికల్గ్రాసుబీల్డు - పదియవడిగ్రీ మొదలు - ఇరువది డిగ్రీలనడుమ
ఆఫ్రికఖండములోని - సూడాన్ కాంగోలదరిని
ఉత్తరమెరికాలోని - మెక్సికో ప్రాంతంబునందు
దక్షిణమెరికాలోని - బ్రెజిల్, బోలీవియమరి - పేరూర్ భాగములయందు
చైనా, మెసపోటేమియా - భాగంబుల ప్రజలబాబు
పాడిపంటలను గల్గి - బాగుమీరనున్నారు ॥వరల్డ్॥

10. మాన్సూన్ ప్రదేశములు - పదియవ డిగ్రీ మొదలు - ఇరువదిడిగ్రీలనడుమ
నియమిత ఋతుపవనముచే - వర్షంబును పొందుచుండి
ఇండియ చైనా జపాన్ - ఉత్తర ఆస్ట్రేలియాల - ఆఫ్రిక అబిసీనియాల
అందలి మానవులు బాబు - ప్రత్తి, పంచదార, వరి - ప్రాముఖ్యపంటలచే
టేకు మొదలుగాగ కొన్ని - గొప్ప వృక్షములను గల్గి
ధనధాన్యంబులచేత - తనరుచుండిరండి బాబు ॥వరల్డ్॥

11. ఈక్విటోరియల్ ఫారె - స్టింపుగ జీరో డిగ్రీ - పదియవడిగ్రీల నడుమ
దక్షిణమెరికాలోని - అమెజాన్ నది పరిసరముల
ఆఫ్రికా ఖండములోని - కాంగోనది ప్రాంతమందు
యీస్టిండియ దీవులలో - యింపుగ నున్నాయి గాంచ
కీటకములు పక్షులు - వనచరములచే నిండియుండ
రబ్బరు పారిశ్రమంబు - కలపకొట్టి జీవించుట
దంతంబుల నితరదేశ - ముల కెగుమతి చేయు జనులు ॥వరల్డ్॥

12. మధ్యధరా మండలంబు - ధర్టీపార్టీ నైవు - డిగ్రీల నడుమ సౌమ్య
శీతోష్ణస్థితినిగల్గి - ఆఫ్రిక ఖండంబుయొక్క - వాయువ్య భాగంబున
నైఋతి ప్రాంతంబందలి - సాగర తీరంబునను
దక్షిణ మెరికాయొక్క - నైఋతి తీరంబునను
యూరపుఖండంబులోని - దక్షిణ ప్రాంతంబునను
ఉత్తరమెరికాలోని - సాన్ ఫ్రాన్సిస్కోదరిని
ఆలివ్, నారింజ, ద్రాక్ష - అత్తి, ఆఫ్రికారన్ బల్
మల్బరీసు పండ్ల చెట్లు - మెండగ యున్నందువలన
పండ్ల ద్రాక్ష సారాయను - వర్తకంబు చేసిజనులు
ధరణిలోన తాతా - జగన్నాధరావు వేదుల - అన్నయ్యశాస్త్రి నేలిడియా
శ్రీరమణుని కృపచేతను - సకల సంపదలను బొంది - సంతసముగ
జీవింతురు ॥వరల్డ్॥

---

# భారతదేశస్త్రీలు - విద్య

విద్వాన్, వేమూరి చక్రధరస్వామి తెలుంగు పండితుఁడు-హిందూహైస్కూలు సత్తెనపల్లి

తెలుగు, ద్రావిడము, మళయాళము, కన్నడము, ఆంగ్లము మొదలగు భాషలనేకములున్నను ప్రతిభాషయందును కవిత్వము, గాయకత్వము, మొదలగు చతుష్షష్టికళలనంబడు విద్యావిశేషము లున్నవి. మానవులు వీనినన్నింటిని సాధింప సమర్థులగుచున్నారు. ప్రతిమానవుఁడు తన భాషయందును మాతృ దేశమందును నభిమానముగల వాఁడనుటకుఁ బదునొకండవ శతాబ్దమువాఁడైన నన్నయభట్టు తన యాంధ్ర శబ్దచింతామణి యందు

శ్లో॥ స్వస్థాన వేషభాషాభిమానాస్సంతో రసప్రలుబ్ధియః లోకే బహుమన్యన్తే వైకృతి కావ్యాని చాన్యదపహేయ"

యనియును నన్నయ భట్టీయ వ్యాఖ్యానకారుఁడగు నప్పకవి తన యప్పకవీయమునందు:-

క॥ "పారికధర్మయెనను తమకర్థరసానుభవంబులేని రసవద్దేశాంతర భాషాకావ్యంబులు, దొరకొని పరియింపము కి దొరకనెదానక"

క॥ ఆయా దేశమువారికి నాయా దేశంబుభాషన మరిన కార్యం,బాయాతపురుషార్థంబులు, బాయక సమకూర్చు"

ననియును, నాంధ్రభోజుఁడనదగు కృష్ణదేవరాయలు" దేశభాషలందుఁ దెలుఁగు లెస్స"యని చెప్పటంబట్టి యాదినుండి మాతృభాషాభిమానమువన పూర్వులెట్లుండినదో తెలిసికొన వీలగును. అంతియకాక

క॥ జిలిబిలి పలుకులఁబలుఁ ముద్దులు గులికెడు తెలుఁగుబాసతో సరియగునే, తెలిసియుఁ దెలియక వీనుల నలయించెదు వెఱ్ఱి మొఱ్ఱియలు పెంటబాపల్.

అనునట్లు వినుటకు సొంపుగూర్చునట్టి శిరీష కుసుమ పేశల సుధామయోక్తులతోఁ గూడుకొనినది మన మాతృభాషయొక

టియే యనినొక్కి వక్కాణింపక తప్పదు. ఆంధ్రదేశస్థుల మగు మనకెట్లు లాంధ్ర భాషముఖ్యమో యట్లే విదేశీయులకును వారివారి మాతృభాష ముఖ్యమనియూ హింపవచ్చును.

మానవుఁడు నిజదారసుతోదర పోషణార్థము తానెంత మాతృభాషాభిమాని యైనను వ్యావహారిక విదేశీయ భాషయగు నాంగ్లమునభ్యసింపక తప్పినదికాదు. పురుషున కెట్లువిద్యముఖ్యమో యట్లే స్త్రీలకుఁ గూడ పాకశాస్త్రము, శిశుపోషణము, చిత్రలేఖనము, సంగీతము, సాహిత్యము, నృత్యము మొదలగునవి ముఖ్యావశ్యకము లై యున్నవి. ఇవియాదికాలమునుండి యాచరణలోనున్నట్లు మనకనేక దృష్టాంతము లున్నవి. మనభారతీయ నారీమణులు ఆది కాలమునుండి యాచరణము నందెట్టి ప్రవర్తనము నవలంబించిరో యట్టి యాచరణను దన నిత్యప్రవర్తనయందు నాచరింప యత్నించు బాలికామతల్లికయే భారతీయ మహిళయని వన్నెకెక్కును.

గృహస్థురాలగు స్త్రీకి నార్యులు గృహిణియని నామంబిడిరి. గృహిణియను పదమునకు గృహమునందలి కార్యములఁ జక్కఁగా నిర్వర్తింప సమర్థతగలది యని యర్థము. కాన విద్యాభ్యాసమునకు "ఓం నమ" లెట్లు ప్రారంభాక్షరములో యట్లే గృహస్థాశ్రమ స్వీకరణకు నాహారపచనాదికార్యములు ప్రప్రథమములు, ఇట్టి కార్యము నెరవేర్పలేకున్న నాసుదతీమణిక ప్రతిష్ఠ కలుగుటయేగాక ప్రియునాదరణకు సైతము పాత్రురాలుకాదు. ఆహారపచనాదికార్యములెట్లుముఖ్యమో యట్లే శిశుపోషణాది కార్యములు సహితముగృహిణీమతల్లులకు ముఖ్యము. పూర్వకాలమున స్త్రీలు తమ శిశువులను దమ స్తన్యపానము చేతనే యతి ప్రీతితో పెంచుచుండెడివారు. కావుననే వారు దీర్ఘాయుష్మంతులుగను దృఢకాయులుగను నభీరులుగను నుండిరని చెప్పక తప్పదు. ఆధునిక కాలమున నవనాగరికత యభివృద్ధియగుకొలఁది కొందఱు నాటిమతల్లులు స్త్రీలకు స్తన్యపానమిూక దాదులచే నిప్పించుటయు, లేకున్న విదేశీయతృణ క్షీర పూర్ణములగు డబ్బాలను వాడుటయు తాము తమశిశువు విషయమై శ్రద్ధ నేమాత్రము తీసికొనక స్నానపానాదులు సైతము నితరులచేతనే చేయించుచుఁ బూర్వాచారములను మఱచి శిశువును పోషించు పద్ధతి తెలియక వైద్యశాలలకు ప్రయాణము సేయుచున్నారు. కాన విచారించి చూడఁగా శిశుపోషణకూడ గృహిణికి ముఖ్యావశ్యకమని తెలియకపోదు.

చిత్రలేఖనము కూడ ముఖ్యమని తెలిసికొనుటకు ద్వాపరయుగము నందలి బాణాసురుని కూఁతురగు నుషాకన్య తన స్వప్నమందుఁ గాంచినపురుషుని మోహించి తన చెలికత్తెయగు చిత్రరేఖతోఁ జెప్పగా నామె సమస్తరాజకుమారుల చిత్రములను రచించి చూపెనను నుషాపరిణయ మొకటి యున్నది. పూర్వకాలమున నారీమణులు తాము మోహించిన సుందరాకారులఁ దామే స్వయముగాఁజిత్రించి యానందించుచుండెడి వారనియు స్వయంవరములందు రాకుమారులచిత్రములఁ దెప్పించు వాడుకగలదనియుఁ బురాణశ్రుతము లగుటచేఁ జిత్రలేఖనమందు మన పూర్వులెంత యభిమానముగలవారో తెలియు చున్నది. రాజరాజనరేంద్రుఁడుకూడఁ దన కుమా

రుఁడగు సారంగధరుని చిత్రపటమును బంపించియే చిత్రాంగిని వివాహమాడెనని గ్రంథములు నడుపుటవలన చిత్రలేఖనమందలి యాసక్తియు దానిపోషణమును నిటీవలవఱకు జక్కఁగాఁ జరుగుచుండెనని యొప్పుకొనక తప్పదు. కాళిదాస రచితమగు శాకుంతలనాటకమున దుష్యంతుడు శకుంత లాదిరహతాపోప శమనార్థము తాను శకుంతలా రూపలావణ్యము నొక చిత్రమునగాఁ జిత్రించి తన చెలికాఁడైన దూషకునికిఁ జూపి సంతోషించుచుండెడి వాఁడనుటవలనఁ బూర్వకాలమున స్త్రీలకు గాక పురుషులకు సైతము చిత్రలేఖ నాభిమానమత్యధికమని తెలియుచున్నది.

ఇఁకను సంగీతవిషయమును బరికింతము. 'శిశుర్వేత్తి పశుర్వేత్తి, వేత్తిగానరసంఫణీ' యను నుక్తిని నెఱుంఁగని వారుండరు. కాన విద్యమాతృభాష మొదలంటవినాశము కానున్న యీనాఁటివఱకు మనభారతీయ బాలికామణుల వాగ్రూపమునఁ గొలఁదిగనో గొప్పగనో వినఁబడుచునే యున్నది. పదునాఱవ శతాబ్దమువాఁడగు నల్లసాని పెద్దన తనకున్న సంగీతాభిమానమును మనుచరిత్రమునందు 'రహివుట్ట జంత్రగాత్రముల ఱాల్ కరగించు విమలగాంధర్వంబు విద్యమాకు' నని వరూధినిచేఁ జెప్పించినాఁడు. దీనివలన నానాటి స్త్రీలకు సంగీతాభిమానము విశేషముగఁ గలదని తెలియుచున్నది. సామవేదమంతయు గానామృతమునే వర్షించుచున్నది. వాగ్దేవతయగు భారతీదేవి వీణను ధరించుటచేతనే సంగీతము యోషామణుల కెట్టి ప్రాముఖ్యమో విశదమగుచున్నది భాషకాదియగు 'అ ఇ ఉణ్' మొదలగు మహేశ్వరసూత్రములు ఈశ్వరుని ఢమరుకమనెడి వాద్యము నుండి యుత్పన్నములైనవే కదా, కాన నాదికాలము నుండి మనపూర్వులకు సంగీతాభిమాన మత్యధికమని యూహింపవచ్చును.

సాహిత్యమను విషయమాలోచింతమంటిమా మనపూర్వులలో మైత్రేయి గార్గి మొదలగు బ్రహ్మవేత్తలయిన స్త్రీలే యపారసాహితీ పాండితిని గలవారు యువతీమణులలోఁగూడ నున్నారని సాక్ష్యమిచ్చుచున్నారు. పూర్వకాలపు స్త్రీలట్టి తత్త్వజ్ఞాన వేత్తలగుటచేతనే తమ భర్తలతో వేదాంత విషయిక చర్చలకుఁ బాల్గొనుచుండిరి. అంతియగాక వాల్మీకి రామాయణమునందు సీతామహాదేవికి "విద్వజ్జనవందితా" యనెడు విశేషణముపయోగించుటచే నాదికాలపు స్త్రీలు ఎట్టి విద్యావతులైనది తెలియుచున్నది. బిల్హణీయమును జదివినవారు సైతము స్త్రీలు అసమాన సాహితీ నిపుణలని యెఱుంగఁ గలరు.

నృత్యముకూడ విచారించి చూచిన ద్వాపరయుగమున నర్జునుఁడు విరాటరాజు దగ్గఱ నజ్ఞాతవాస మొనర్చుకాలమున నాతని కుమారియగు నుత్తరకు నృత్యమును నేర్పుచుండినట్లు భారతము సాక్ష్యమిచ్చుచున్నది. ఇంద్రుఁడెప్పుడును మునులతో గోష్ఠిసలుపుచుఁ దనసభయగు సుధర్మయందు రంభోర్వశీ తిలోత్తమాదుల నృత్యముచే నానందించుచుండును. ఒకప్పుడు వీరినృత్యము నందెవరి నృత్యమధికమో గ్రహింపలేక భూలోకమునుండి విక్రమార్కుని స్వర్గలోకమున కాహ్వానించెననియు, నాతఁడు

స్వర్గలోకమునకు నేగి రంభోర్వసుల నాట్య ముందిలకించి యూర్వశీ నాట్యమునందలి సూక్ష్మాధిక్యమును గ్రహించి వాసవునకుఁ దెల్పెనని గ్రంధములు నుడువుటచే నృత్య మందు భారతీయుల కెట్టి నిపుణతగలదో యూహ్యమగుచున్నది.

ఈవిధముగా విమర్శించుకొనిన నింకను ననేకవిధములఁ బైవిద్యలను నాదికాలము నుండి భారతనారీమణులెంతయో భక్తి శ్రద్ధలతో నేర్చుకొనుచు వానికి వన్నె పెట్టు చునే యుండిరి. కాని ప్రస్తుతకాలమున విదేశీయ భాషా వ్యామోహమనెడి పిశాచమావరించి భారతీయులు కాణాచిగా నుంచుకొనిన విద్యల నన్నింటిని నడుగంట ద్రొక్కుచున్నది. పురుషులెట్లో తమ యుదరపోషణార్థము విదేశీయ భాషావ్యా మోహ పిశాచమునకు లోఁబడక తప్పి నదికాదు. నవీనయుగనారీమణులు విదేశ భాషాజ్ఞానాభివృద్ధికై స్త్రీపురుష వివక్షత లేక లౌకిక జ్ఞానవేత్తలయిన తరువాత నైతము సలజ్జా గణికానష్టా నిర్లజ్జేన కులాంగనా" యను లోకోక్తిని మఱచి మితిమీఱినధనవ్యయమునకు శరీరారోగ్య హైన్యమునకును వెనుకంజవేయక దేశాంత రములకేగి పాటునడుట యుక్తవయస్కు లగు నారీమణులు విచారింపఁదగిన విషయము.

స్త్రీలెంత నిష్కళంకు రాండ్రయినను దుష్టులదృష్టికి గుఱిగాక తప్పదు. తాళ వృక్షచ్ఛాయను క్షీరముంగ్రోలినను, మద్య పానముచేసినట్లే జను లూహింతురుగదా! కాన లౌకికజ్ఞానార్జనమునకై కొంతవఱకిట్టి భాషాభ్యసనము సమంజస మగునేమో కాని యుక్త వయస్కులయిన తరువాత నైతము బిరుదాపేక్షయుక్తులై దేశాంతర ములకు వెడలి విద్యాభ్యాస మొనర్చుట మతాచారములకు ద్రోహ మొనర్చుట యని భావింపవలసివచ్చును. అంతియకాక ముఖ్యముగా గృహిణీమతల్లుల కుండవల సిన శిశుపోషణాది కార్యము లడుగంటి పురుషుఁడే యాకార్య నిర్వహణ సమర్థత కభ్యాసితుఁడు కావలసివచ్చును. పురుషుఁడే యట్టికార్యము నిర్వర్తింపవలసి వచ్చె నేని వ్యవహారములు తారుమారై స్త్రీయే యుదరపోషణకుఁ దగుభారము వహింప వలసివచ్చును. అప్పుడు మగవాడు తీరు గక చెడును. యువతి తిరిగిచెడుననునట్టియు పురుషునిచేతిశిశువు స్త్రీహస్తమునక్కదను నట్టి లోకోక్తులు సార్థకములై వ్యవహార భ్రష్టత సంభవింప వచ్చును. భారతనారీ మణులు లోకజ్ఞాన యుక్తురాండ్రగుటకు మాతృభాషలో నసంఖ్యాకములగు గ్రంధ ములున్నవి. వేనిచేఁ బురుషార్థములను సాధించు కొనవచ్చునో రామాయణాది యుద్గ్రంధములు రామాయణలెట్లు తమ జీవితమును ప్రఖ్యాతవంతముగ గడుపవల యునో బోధించుచున్నవి. భారతీయుఁ డెవరెవరికడ నెట్లెట్లు మెలఁగి తనజీవితము నెట్లు సార్థకపరుపవలయునో పూర్వమున మహానుభావులనదగువారు తమజీవితము నెట్లుగడిపి సార్థక పఱచుకొనిరో యట్టి విషయమును రామాయణాది యుద్గ్రంథ ములే ఘోషింపుచున్నవి. వర్తమాన రాజ్యాంగ వేత్తలు న్యాయాధికారులు మొదలగువారిట్టి గ్రంథములనే యాధార ముగాఁ గొనుచున్నారుకదా!

స్త్రీలు జ్ఞానసంపాదనకై ధనవ్యయ ప్రయాసలకు సహించి విదేశములకు సహి

తమ వెడలి విదేశీయభాషల నెంతయాసక్తితో గ్రహించుచున్నారో యందులో శతాంశమైనను మాతృభాషయందు శ్రద్ధ వహించినచో దేశమునందు గ్రమక్రమముగా క్షీణించుచున్న ప్రాచీన విద్యలకు గొంతయాధార మేర్పడును. లౌకిక జ్ఞానార్జనమునకై సమస్తవిద్యల నభ్యసింపవలసినదేకాని "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" యనెడు లోకోక్తిసిమాత్రము మనంబునందుంచుకొని మాతృదేశమును మాతృభాషను నుద్ధరింపఁబూనుకొనవలయును.

"ఉదరనిమిత్తో బహుకృతవేషః" అనునట్లు నెవరియుదరపోషణ సదుపాయము వారు చూచుకొన వలదాయనిన స్త్రీలను భరించుభారము పురుషునిదేకాని స్త్రీ తన యుదరపోషణంకై యెట్టి యిక్కట్టు పడనక్కఱలేదు.

శ్లో॥ పితారక్షతి కౌమారే భర్తారక్షతి యౌవనే
రక్షంతి వార్ధకే పుత్రాః।

యను శ్లోకము ప్రకారము స్త్రీ, తన రక్షణకొఱకై కష్టపడవలసిన పనిలేదని తెలియుచున్నది దీనినిబట్టి పూర్వులు స్త్రీలవిజ్ఞాన మభివృద్ధి నొందుట కిష్టములేక యిట్లు రచించిరని కొందఱూహింపవచ్చును. కాని కేవలమట్టి యభిప్రాయము పూర్వుల కుండెనని తలంచుట విచారణీయము. ఎట్లనఁగాఁ దల్లితనకుమారితను రూపవంతుఁడును ధనికుఁడునగు వరునిగాఁ జూచి యీయవలయునని కోరుచుండును తండ్రి, నిర్ధనికుఁడైనను విద్యావంతునిగఁ జూచి కన్యాదానము చేయవలయునని యనుకొనుచుండును. అట్లుగాక వధువు కోరికప్రకారము పితలు ప్రవర్తించినచో నామె "కన్యావరయతేరూపం మాతావిత్తంపితా శ్రుతమ్" నునుడిప్రకారమునరునిరూపమందే యాశక్తి గలదగునుగాని తనభావిజీవితమును గుర్తింపనేరదు, కాన నామె యభిలాషచొప్పున యక్తాయుక్త విచక్షణలేక, యే రూపవంతునకో యిచ్చిన నామె దురదృష్టవశమున నాతఁడు విద్యాధనములులేనివాఁడయ్యేనని యాదంపతుల భావి జీవితమునుగూర్చి నామె తల్లిదండ్రులే విచారింపవలసివచ్చును. కానఁబూర్వులు స్త్రీలపై నభిమానము గలవారగుటచేతనే యుక్తాయుక్తముల గ్రహించి పైవిషయముల సూచించిరి.

ఇఁకఁ పురుషుని విషయము చూచిన స్త్రీలు "అబల" లనియు వారిమనంబున కేమాత్రము కష్టము గలిగింపరాదనియు నట్లు కలిగించినచో "కలకంఠకంటికన్నీరొలికిన సిరియింట నుండనొల్లదను" జనశ్రుతి ప్రకారము తాను కష్టములపాలు గావలసి వచ్చుననియు విశ్వసించుచున్నాఁడు. స్త్రీల మాయను దాఁటుట యశక్యమని "ఇనుప కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల, తామరస నేత్రలిండ్ల బందాలుగారె" యని మనుచరిత్ర దెలుపు చున్నది. దశరథుఁడు తనకు లేక లేక యఱువదివేల సంవత్సరములు పాలనమొనర్చిన తరువాత పుత్ర కామేష్టి ఫలితముగాఁగలిగి యల్లారు ముద్దుగా చూచుకొనుచున్న శ్రీరామ చంద్రుని బాల్యమందే ఘోరారణ్యములకుఁ బంపినది ప్రియురాలకు కైకేయి యందుగల యనురాగము వలననేకదా! మనయింటిలోని బాలుఁడొక క్షణము కనుపింపకున్న నాయారంగల నాల్గు వీధులుం గ్రుమ్మరుదుమే. అంతటి పుత్ర

ప్రేమగల దశరథుఁడు భార్యమీఁది యను రాగమున తన పుత్రునెట్లు విచ్ఛిన్నము చేసికొనినాఁడో చూడుఁడు. శ్రీరాముఁడు మాయామృగమును వెంబడించినది భార్య కోరిక నెఱవేర్చుటకేగదా! అతఁడు పులస్త్యబ్రహ్మవంశము నంతయు నాశన మొనర్చినది భార్యను జెఱనుండి విడిపించుటకేకదా! ఈశ్వరుఁడర్ధనారీశ్వరుఁ డగుట యెందులకు? గంగను శిరమున దాల్చిన దెందులకు? బ్రహ్మ వాణిని దనవాక్కున నిల్పుకొనుట యెందులకు? విష్ణువు సిరిని యురమున దాల్చిన దెందులకు? వీరందఱట్లొనర్చుట తమయర్ధాంగుల యందుండు ప్రేమానుబంధమును బ్రకటించుటకేకదా! పురాణేతిహాస శ్రుతములగు నీవిషయములను రచించిన మన పూర్వులు స్త్రీల యౌన్నత్యము నభినందించి వ్రాసిరో యీర్ష్యాదులచే వ్రాసిరో బాగుగ నెఱుంగవచ్చును.

ఇంతియకాక మనపూర్వులు స్త్రీలకెట్టి మహోన్నతస్థాన మొసంగియుండిరో కనుగొనుటకుఁగూడ ననేక దృష్టాంతములు గలవు. స్త్రీ లొనర్చిన పాపమును పురుషుఁడు పంచుకొనునట్లును బురుషుఁ డొనర్చిన పాపము స్త్రీలకుఁ జెందక యాతఁడొనర్చిన పుణ్యము మాత్రము నగభాగము చెందునట్లు మనపూర్వులే శాస్త్రనిర్మాణముచేసిరి. మన కనులకు గోచరమగు నీ ప్రపంచమంతయు నాదిశక్తి వలననే నిర్మితమయ్యెననియు, త్రిమూర్తుల కసాధ్యమగు కార్యములు సైతము మహిషాసుర మర్దని, దుర్గ మొదలగు శక్తి రూపములచేతనే సాధింపఁబడు చుండెననియు, శతకంఠ రావణాసురుని శక్తిరూపమున సీతయే సంహరించెననియు బ్రహ్మ వాక్కులనుండి వెలువడు వేదములలోని "ఓం" కారమందలి మకారము శక్తి బీజమనియుఁ బురాణములు నుడువుచున్నవి. ద్వైవాదులను లెక్కించునపుడు తల్లి,దండ్రి గురువు, దైవమని తల్లినే మొట్టమొదట లెక్కించు నాచారము గలదు. నామములందు సైతము "స్త్రీపురుషులు, ఉమామహేశ్వరులు, పార్వతీ పరమేశ్వరులు, వాణీ హిరణ్యగర్భులు, రాధాకృష్ణులు, సీతారాములు, లక్ష్మీ నారాయణులు" అని స్త్రీ శబ్దమే మొదట వినఁబడుచున్నది.

విదేశీయులు మనశ్రుతి స్మృతి ఇతిహాసాదులను చూచి యత్యాశ్చర్యమగ్నులగు చున్నారు. అంతియకాక మన మస మర్థులమగుట గాంచి మన యమూల్య గ్రంథములను గొంపోయి భాషాంతరీకరణముంగావించి యభ్యసించి సారాంశమును గ్రోలుచు మనము వారలనే దేవతలనుగా భావించునట్లు భ్రాంతిని జనింపఁజేయుచున్నారు. అట్టి విదేశీయులు స్త్రీలకెక్కువ స్వాతంత్ర్యమిచ్చిరనియు మన పూర్వులు స్త్రీల నస్వాతంత్ర్యులుగా నొనర్చి యధోగతి పాలొనర్చిరనియు విదేశీయ భాషా భ్యాసకులు తలంచినఁ దలంప వచ్చును గాని మన పూర్వగ్రంథములను గొంత వఱకైన గాంచినచో నది మృగతృష్ణవంటిదని విశ్వసింపక పోరు. కాన భారతాంగన పూర్వులెట్టి యాచారమును పాటించిరో యట్టి యాచారములను దాననుష్ఠించుచు విదేశీయ యాచారముల యథార్థమును గనుంగొని తమ కుపకృతి యొనర్చునవి

యుండిన స్వీకరింపవచ్చునుగాని మాతను దేశాచారములను విడచి కేవలము అన్య విడచిన మాతరక్షించునని యాశ్రయించు దేశీయ భాషాచారముల నభ్యసించుట వారివలెఁ దమ మాతృభాషను మాతృ విచారము.

---

# సంక్రాంతి పర్వము

## "వికళాకవి"

శ్రీమాన్ కె. వి ఆర్. ఆచార్యహారితస్

శ్రీకృష్ణా ! లీలామా
త్రాకృతనర దేహా ! కొమ్మ, అంకితముస్వీకృ
చ్ఛీకృతి, వేణురవసుధా
శ్రీకృత గోపీహృదయుఁడ ! శ్రీసర్వేశా ! ౧
శ్రీవాణీ సతితోడు వేడెదయశశ్శ్రీఁబ్రోచి యశ్రాంతమున్
గానంగాఁ గొడకండ్ల వేంకటసరంగాచార్య నామాంకితున్
భావోద్రేకతఁ జెప్పరాను విది, దుర్భావంబులన్ఁపీడి, స
ద్భావంబుల్ గ్రహియించి, దీవనల సంభావింపు మో, పారకా! ౨
శ్రీవృషాసమా పౌష్యలక్ష్మీసమగ్ర !
బాఢ భాశ్లేషగాఢసమీాఢ ! రూఢ !
లీఢ ! సంక్రాంతిప్రౌఢ ! నవోఢ ! జయము
స్వాగతంబిద్దె కొమ్మ సుస్వాగతంబు ! ౩
తులసికోటకుఁబూజల తోడమ్రొక్కి
మాయమర్మముల్ లేని బ్రాహ్మణకుమారి;
వీరపత్నియౌటకో, లేక, వీరమాత
యౌటకో, ధవుఁడు విజయుఁడౌటకో యని,
రక్షఁగోరుచుమ్రొక్కి నా రాజకన్య;
బేరసారాల భారంబపార మెఱిఁగి,
తానె, ప్రజకమ్మఁగొట్టు పెత్తనముఁజేయుఁ
జిన్నిచేతుల కోమటి కన్నెమొదలు,
జొన్నచేలలో నొడిసెలఁబన్నివిసరి,
కంచుకోలల బిట్టలదంచి, తోలు
కండుటెండను నెత్తినౌ కాపుకన్నె
వరకు, బాలలందఱునీకుఁ బ్రణుతులిత్తు;

బహుళవిభవవు సంక్రాతి ! పౌష్యలక్ష్మి !
వందనంబిదె, కొమ్మభివందనంబు. ౪

ప్రొద్దుపొడువకమున్నె గొబ్బునను లేచి,
కాల్యకృత్యాలవెన్క మొగఁబుఁగడిగి,
గోమయంబున వరుసగా గొబ్బెతలనుఁ
జేసి, చిఱుచేతఁబీట వేంచేపుఁజేసి,
పసపుకుంకుమవెట్టి సాంబ్రాణివైచి,
వివిధపూవులఁ బూజఁగావించి, భక్తి
విలువఁ దెలియకేపండ్ల నైవేద్యమొసఁగి
మ్రొక్కు లిడెదు పండ్రెండేడ్ల ముద్దుబాల
లేమిఁగోరుచుఁజేతురో ? ఎవరికెఱుక ?
శాశ్వతానంద ఫలద సంస్మరణమునకొ ?
గాననృత్యాది కళల విజ్ఞానమునకొ ?
సరసకావ్య పాండిత్య విశారదతకొ ?
తల్లిఁదండ్రులకీర్తి స్వతంత్రలతకొ ?
తోడిచెలిమి కత్తియల సంతోషమునకొ ?
కోరుకొన్నట్టి నిజభర్తఁజేరుటకునొ ?
కట్టుకొన్నట్టిధవుని దీర్ఘాయువునకొ ?
కోరుచుంద్రు బాలలు శక్తికొలది, ఇద్ది
కామకర్మమో, లేక, నిష్కామవ్రతమొ ? ౫

ఒకజాము కడచువరకును
చకచకమని, యింటిపనులఁజరపి, తమచెలుల్
సకల విధాలంకరణలు
పకపకనవ్వుచును రాగ బాలేందుముఖుల్. ౬

జతగూడి నృత్యగీతా
రతిఁగొల్చి యనేకముద్దురకముల పాటల్
మతికిం బొదవించెదు సా
మెతలనుఁబాడుదురు రక్తి మీరిన భక్తిన్. ౭

'గొబ్బియ్యలో, గొబ్బియ్యలో
గబ్బిగుబ్బ గుబ్బెతలరు గొబ్బియ్యలో'
అని పాడుచు మన మూరట
గొనుపనితో గొబ్బెఁదట్టు కొమరుంబ్రాయం

బుననొప్పు బాలికామణు
లణుమాత్రము పొల్లుఁబోక నర్చింత్రుగదా !
అట్టిదినముల. . . . . . .............
.. .... ........ నెత్తినక్షయపుఁబాత్ర
తొట్టిపడకుండ పరుగులతోడఁబారు
దట్టియగువారు, గడపలఁదారసిల్లఁ
'బట్టు' మనిపెట్టు బియ్యంపు బహుమతిఁగొను
నట్టిహరిదాసు లదె దారిబట్టువారు;
కట్టి కాషాయవస్త్రంబుఁ గటినొకంతఁ
జుట్టి, మెడను త్తరీయంబ దట్టెవ్రేలఁ
బట్టుతంబుర మీటనట్టిట్టునాడ
గట్టిగొంతుక రాయఁ బాటెట్టులెట్లొ
బుట్టుఁ, బట్టుసూత్రతులసిపూసపేరు
లట్టిటూడంగ, 'హరి,రంగ !' యంచువచ్చు
దాసవరులగ్గొ! హరిదాసదాస వరులు.

స్నాన సంధ్యాద్య నుష్ఠానములు మఱచి,
వరువాతనిద్రగా వరముఁబోయి,
బ్రాహ్మణుల మటంచుఁ బల్కువారికి బుద్ధిఁ
జెప్పింపఁగా బోధఁజేయుటేమొ;
శౌర్యప్రతాంబుఁ జల్లారఁ బిరికి త
నమున, మూలలఁ, బిల్లిసక్కినట్లు,
గాజులమ్మలతో సమాజిఁ దేలుచు నాజి
వాజి నెక్కఁగలేని రాజవాసుల,
దేశదాస్య విముక్తిఁదెప్పింపుఁడని, రూఢ
వీరాగ్ని రాజేయ వెడలుటేమొ;
ఎప్పుడైననుగాని, ఎంగిలిచే తైనఁ
గాకిన్ విదల్పక నాకి, కుక్క
పోలె లోభముఁ నాశఁ పుట్టంగ, దానధ
ర్మముల మఱచి, వేశ్యారతులఁ దేలు
వైశ్యుల, వ్యాపారవాణిజ్యముల్ ధర్మ
ములుఁజేసి ముక్తినిఁ బొందమనుటొ;
వ్యవసాయమేమిటో, పశువులఁ బెంచుటె
ట్లో, తెలియ, కగచాట్లుఁబడి, కట్ట

బట్టయు లే, కోక పట్టెడన్నము లేక,
వీధివీధులలోన బిచ్చమెత్తు
శూద్రవరులకునుఁ బ్రశాంతిఁ జూర నిడుటో,
అష్టె పులిహోర దధ్యోదనాలు నాది
మెక్కి, పొంగరెక్కి, హరిఁదక్కి, నిక్కిపడుచు,
జారులై, రోగభారులై, సానిదాసు
లైని, చాత్తాది వైష్ణవులందు కొనఁగ,
భక్తిచిగురొత్త, హరిదాసు భజనచేత
నిన్నుఁదనియించు నీదుసన్నిధినిఁ జేరి,
లీఢ ! సంక్రాంతిప్రౌఢ, నవోఢ ! జయము. ౧౦

కలి ఇదొటమ్చునకైనఁగాని సత్య
వాది ఒక్కఁడైననులే, డబద్ధమేల?
కామరోగులుకాని, నిష్కామభక్తి
పరులుముందునకైన నేవంక లేరు !
ఇట్టిపశుమృగప్రాయ పాపిష్ఠిజనుల ౧౧

శ్రీమదాంధులఁజేరి రాజీవనేత్రు
హరిని భజియింప, హరిదాసు 'హరి,రంగ'
యంచువచ్చెడి ముక్తి మ్రోయించుభక్తి
దేశకళ్యాణమునకు సందేశమేమొ ?
దివ్యస్వాతంత్రతాభక్తి దీక్షయేమొ
ఊర్ధ్వపుండ్రాదులనుఁదాల్చి నూర్ధ్వదృష్టి
దేవభజనలచే నొడల్ఁ దెలివిదప్ప
పరమపద సౌధ సోపాన పంక్తిఁజూపు
పరమత్నైష్ఠికత్వపూబంభరంబు. ౧౨

పూర్వజన్మ సత్కృతమహాత్మ్వాజ్యపూర్ణ
పుణ్యఁపుందపః ఫలిఁ గూర్మిపుత్రియాచు
నవనిఁ దులసీమనీజ, నాండాళు దేవి,
శ్రీరమ, పెరియాళ్వారు నాశీర్వదించె;
నామె శ్రీహరిం బరిణయంబాడఁగోరి
నూట యెనిమిది దివ్య పుణ్యాటతటుల,
దిరుపతుల నెంచి, పాలించు దేవులందు,
రంగుగవరించె, గోద, శ్రీరంగనాథు;
భక్తినాళ్వారుగాఁ దిరుప్పావుఁ బాడి
ధన్యయై ధనుర్మాస నుద్వాహమయ్యె

భోగిపండుగనాడు వైభోగమలర
భోగిశయనుని హరి, మహాభోగి, శౌరి. ౧౩

అట్టి నీదురాక, నటికఁ గావడిపెట్టె
లట్టె దిగును, బొమ్మలుట్టిపడునుఁ
గొల్వుదీర్చి, పెండ్లి కూడఁ జరుగుఁ
బేరటాండ్రు వీధి పేరటంబుఁ గండ్రు. ౧౪

బొమ్మపేరంటముకుఁ బోఁబోవువారు,
పేరటానంతరంబిండ్లఁ జేరువారు,
చేరి ముచ్చట్లఁ బ్రొద్దుఁగాఁ జేయువారు,
ప్రొద్దుఁబోయెడిదాక పాటద్ది, రార,
బాగు, బాగనిమెచ్చఁగాఁ బాడువారు,
నవ్వులాడెడువారు కన్యకల బారు. ౧౫

క్రొత్తకెంబట్టుచీర, రేకొత్తునంద
ముట్టి పడఁగట్టి, కలహంసముగతినడువ
గాళ్ళగజ్జియల్ మట్టియల్ 'ఘల్లు'నంగ,
భావజుని తేరుటెక్కెంపు బారులనఁగ,
రమణులొయ్యారమున లసద్రసవచాళిఁ
బోవుచుందురు సంక్రాంతిఁ బుణ్యసతులు
సెంటువాసనబూతఁ బేరంటములకు. ౧౬

'పూలు, చేమంతిపూల్, బంతిపూల'టంచు,
వీధినమ్మెడు పుష్పలావికలసొరు
వేయినాల్కల శేషుఁడావిలువఁజెప్ప;
బమ్మదేవుడుఁ బుట్టబో రిమ్మతెగులు !
వమ్మె, పరులుమోహింప; గొంతెమ్మకోర్కె !
ఎల్లకాలాలఁ గవితరాజిల్లు సుకవి
రింఖణంబులు, వారి వర్ణింపఁగలరె? ౧౭

'సరికి సరి' యంచు ధాన్య సంచయముఁగూర్చి
రేఁగుపండ్లమ్మ నార్చెలరేగి, ఇండ్ల
గుమ్మ గుమ్మాలనమ్మ; జనమ్ము గొండ్రు
భోగిబోడిని, పుట్టిన ముద్దురోజు,
'బోడిఁ' బసిబిడ్డలకుఁబోసి, బొమ్మదేవు
లారగింపంగ ముత్తైదు లారగింత్రు
బాల బాలికావళితోడ 'వహ్వా' యనుచు. ౧౮

చెఱకు గడలను జీకుచోఁ జీల్చఁబడ్డ
లలితకెంబెదవుల నిక్షురసముఁ దడియు
క్రొత్తచొక్కాలఁ దాల్చి కూర్చున్న బాల
బాలికావళికెంత సంబరము, చెప్పుమ! ౧౯

సరస సౌందర్యశృంగారసరులు క్రొత్త
దోవతి నుత్తరీయాల సంతోషమునను
దాల్చి, బాలకాళికిఁ జిత్రతరఁపు వస్తు
సంచయముఁ గొని, కూర్తురు సంతసంబు. ౨౦

(సశేషము)

---

# వాసుదేవుఁడు

రామవరపు కృష్ణమూర్తిశాస్త్రి

వాఙ్మయప్రపంచమున శబ్దములు వ్యుత్పన్నములనియు, నవ్యుత్పన్నములనియు రెండు విధములు. అవయవార్థముచే విశిష్టార్థమును జెప్పునవి వ్యుత్పన్నములు. పాచకుఁడు, పంకజము మొదలగు పదములిందుల కుదాహరణములు. సముదాయశక్తిచే విశిష్టార్థమును బోధించు పదములు రెండవ రకములోఁ జేరును. ఘటము, మండలము మొదలగునవి యిందుల కుదాహరణములు. ప్రకృతమైన వాసుదేవ పదము మాత్రము వ్యుత్పన్నముగానున్నట్లు ప్రసిద్ధము. వసుదేవుని కుమారుఁడు-అనగా-కృష్ణుఁడని సారస్వత లోకమునకుఁ బరిచితము.

ఈ వాసుదేవ పదము గీతలలోను, భాగవతములోను, రామాయణమునందును, ఇంకను కూర్మపురాణము, పద్మపురాణము, విష్ణుపురాణము మొదలగు ప్రాచీన గ్రంథములం దనేక స్థలములందు గలదు. ఈ గ్రంథములన్నిఁటియందుఁ గూడ వసుదేవకుమారుఁడనియే యర్థము చెప్పవలయునా? లేక యర్థాంతర మేదియైన నకలదా? యని యొక సందేహము కలుగుచున్నది. ఈ సందేహమునకుఁ గారణమేమనగా— భారతమునందలి గీతలలో వాసుదేవ పదమునకు వసుదేవ కుమారుఁడని యర్థము చెప్పినను, ఆ భారత చరిత్ర కాలమునాటికి కృష్ణుఁడు వసుదేవ కుమారుఁడుగానే ప్రసిద్ధుఁడు కావునట్లు చెప్పుట యుచితమే. కాని భారతకాలము కంటె రామాయణకాలము చాల ప్రాచీనమయినది. రామాయణ కాలమునాఁడు వసుదేవుఁడే పుట్టలేదు. అట్టితరి యాసమయమున వసుదేవుని కుమారుఁడగు కృష్ణుఁడను నర్థము వాసుదేవపదమున కెట్లు నిశ్చయింపవీలగును? ఇట్లే మిగిలిన పురాణములందలి వాసుదేవపదము విషయమున గూడ నీ సందియము కలుగుచున్నది. ఉదా—

శ్లో॥ యస్యాయం వసుధాకృత్స్నా వాసుదేవస్య

ధీమతః మహిషీ మాధవస్యైషా సఏవభగవాన్ ప్రభుః॥ (రామాయణ)

బుద్ధిమంతుఁడును, లక్ష్మీనాథుఁడును నగు నేవాసుదేవుని కీసమస్తభూమియు భార్యగానున్నదో, అతఁడు-భగవన్తుఁడని యీశ్లోకార్థము.

వీఁటినిబట్టి విచారించగా వాసుదేవపదమునకు వెనుకటి వ్యుత్పత్తి ననుసరించి వసుదేవుని కుమారుఁడని చెప్పుటకు వీలు లేదుకదా ? ఈరామాయణమును సరిగా సమన్వయము చేయవలెనన్నచో, నీవ్యుత్పత్త్యర్థమును విడచి రూఢముగా ఘటపటాది పదములకువలె, వాసుదేవ పదమునకుఁ గూడ భగవన్తుఁడను నర్థము చెప్పవలసియుండును. కాని ప్రసిద్ధమయిన వ్యుత్పత్త్యర్థమును పరిత్యజించి రూఢ్యర్థమును గ్రహించుట న్యాయ్యమా? అని యనినచో -"యోగాద్రూఢిర్బలీయసీ" యోగికార్థముకంటె రూఢ్యర్థము బలముకలది కావున వాసుదేవపదము రూఢముగా విష్ణుమూర్తిని బోధించుచున్నదని చెప్పవలయును. అట్టిచో విష్ణువు సర్వకాలములందుండువాఁడు కావున నేగ్రంధమునందలి వాసుదేవపదముకూడ వ్యతిరేకించదు.

లేదా ఈవాసుదేవపదమునకు వ్యుత్పత్త్యర్థమును విచారించినను నొకవిధముగ సమర్థింపవచ్చును. వెనకటి వ్యుత్పత్త్యర్థమును జెప్పినప్పుడు వసుదేవపదమునకు అపత్యార్థకమయిన "అణ్" (కృత్) ప్రత్యయము రాగా వాసుదేవపదము సాధువైనది. ఇప్పుడట్లుగాక మఱొక విధముగా జెప్పుకొనవలయును. వసతీతి-వాసుః=ఆత్మరూపుడుగా నంతట నుండువాఁడు. "వస=నివాసే" అనుధాతువునకు "అణ్" రాగా వాసుః అనుశబ్దమేర్పడినది. దీవ్యతీతి-దేవః = ప్రకాశించువాఁడు. వాసుశ్చాసౌ దేవశ్చ-వాసుదేవః= అంతట నాత్మరూపముగా బ్రకాశించునట్టి పరమాత్మయని యీ నిర్వచనమువలనఁ దెలియుచున్నది. ఈయర్థము నంగీకరించినచో వ్యుత్పత్త్యర్థమును విడువకుండుటయు నేగ్రంథము వలనఁగూడ విరోధము రాకుండుటయు గుదురుచున్నది. యర్థమున కనుగుణముగ విష్ణుపురాణమిట్లు చెప్పుచున్నది.

శ్లో॥ వాసుస్సర్వ నివాసశ్చ విశ్వాని సర్వలోమసుఁ
తస్యదేవః పరంబ్రహ్మ వాసుదేవ ఇ తీరితః॥

వాసుః-అనఁగా సర్వత్ర ఉండువాఁడనియు లోకములన్నియు నతనిలోమములందిమిడియున్నవనియు, దేవః=అనగా పరబ్రహ్మమనియు, గావున నాపరబ్రహ్మమునకు "వాసుదేవ" పదము వాచకమయినదని యీశ్లోకార్థము. ఒకానొకచోట నీవాసుదేవపదమునకు సనాతనమనెడి విశేషణ వాచకపదము కూడకలదు. "భగవాన్ వాసుదేవశ్చకీర్త్యతేఽత్రసనాతనః"=భగవత్స్వరూపుఁడును, సనాతనుఁడు నగు వాసుదేవుఁడిచ్చట గీర్తింపఁబడుచున్నాఁడని దీని యర్థము. ఇచ్చట వాసుదేవపదమునకు వసుదేవుని కుమారుఁడు సనాతనుఁడు కానేరదుకదా? ఎవఁడు సనాతనుఁడో, ఆతఁడు వసుదేవుని కుమారుఁడు కానేరఁడు. కావున నీపదమునకీ రెండవ వ్యుత్పత్త్యర్థము నంగీకరించిననే కాని యీ పైశ్లోకమునందలి సనాతనమనెడి విశేషణవాచకపదమున కన్వయము కుదురనేరదు. అంతటను ప్రకాశించునట్టి పరమాత్మసనాతనుఁడే కదా ? భారతము

కూడ యీరెండవ వ్యుత్పత్త్యర్థమునే ధ్రువపఱచుచున్నది:-

శ్లో॥ వాసనాత్సర్వ భూతానాం వసుత్వాద్దేవయోనితః వాసుదేవ స్తతోవేద్యో బృహత్వాద్విష్ణురుచ్యతే॥

సర్వప్రాణులను దనయందుంచుకొనుట వలనను, తాను దేవ యోనిగా నుండుట వలనను, పరమాత్మవాసుదేవుఁడుగాఁ దెలిసికొనఁదగిన వాఁడనియు, నంతటనువ్యాపించి యుండు వాఁడుకావున విష్ణువుగాఁ జెప్పఁబడుచుండెననియు నీభారతశ్లోకముధ్రువపఱచుచున్నది. వ్యాకరణ మహాభాష్య వ్యాఖ్యాత యగుకైయటుఁడు కూడ తన కైయట వ్యాఖ్యానమునందు "కశ్చపువర్ని త్యానాంశబ్దానామ్" ఇత్యాదికముచే నీపైనఁ జెప్పఁబడినయర్థమును ధ్రువపఱచినాడు. రామాయణమునం దొకానొక స్థలమున వాసుదేవపదము భగవత్స్వరూపుఁడగు కపిలునియందు వ్యవహరింపఁబడినది. వసుదేవునికుమారుఁడని యర్థము చెప్పినచోఁగపిలుఁడు వాసుదేవాపత్యము కాదుకాదా? ఈవెనుకటి విధముగాఁబరమాత్మయను నర్థమునంగీకరించినచో గపిలుఁడు కూడ పరమాత్మయొక్కమూర్త్యంతరముకావున నీయర్థము సరిపోవును. కావున వాసుదేవుఁడనగా-అంతటనునాత్మరూపుఁడుగాఁ బ్రకాశించునట్టి పరమాత్మయనియే నిశ్చయముగాఁ జెప్పవలయును గాని వసుదేవు కుమారుఁడని సార్వత్రికముగాఁజెప్పటకువీలులేదని నాయూహ ఈయర్థమునే ధ్వన్యాలోక గ్రంధకర్తలు మొదలుగువారు విస్తరముగా నిరూపించినారు.

---

## చందాదారులకు మనవి

మహాశయులారా !

మా పత్రిక జనవరినెల సంచిక (1942) సకాలములో ముద్రింపఁబడినను Postal Concession (తపాలా తగ్గింపునకు అనుమతి) క్రిందటినెల 15 వ తేదీనాటికి రానందున తపాలాచార్జీలు ఎక్కువగునని సదరు సంచికను ఎవ్వరికిని పోష్టుచేయలేదు. ఈ నెల సంచికతోఁబాటు క్రిందటి సంచికనుగూడ పంపుచుంటిమిగాన చందాదారులు మాయెడఁగినియకుందురుగాక యని మనవి.

—సంపాదకుడు.

# వ్రాతలోని తప్పులు




# నూరు భాగములకు

(వేదుల అన్నయ్యశాస్త్రి)

| ఆహార పదార్థములు | మాంసకృత్తులు | పిండి పదార్థములు | క్రొవ్వు పదార్థములు | జలము | లవణములు | ఇతరములు |
|---|---|---|---|---|---|---|
| వరిబియ్యం | 6 5 | 79.1 | 0 6 | 2 8 | 0 6 | 0 4 |
| చోళ్లు (సొజ్జలు) | 7.3 | 73.3 | 1 5 | 13 2 | 2 3 | 2 5 |
| మొక్కజొన్నలు | 9 5 | 70.7 | 3 6 | 12 5 | 1.7 | 2.0 |
| జొన్నలు | 9 3 | 72 3 | 2.0 | 12 5 | 1.7 | 2.2 |
| గోధుమలు | 13 5 | 68.4 | 1.2 | 12.5 | 1.7 | 2 2 |
| సెనగలు | 21 7 | 59 0 | 4.2 | 11.5 | 2 6 | 1.6 |
| మినుములు | 22.7 | 55.8 | 2 2 | 10 1 | 4 4 | 4.8 |
| చిక్కుడు | 35 3 | 26 0 | 18 9 | 11.0 | 4 6 | 4.2 |
| క్రొవ్వులేనిమాంసం | 18.3 | — | 4 9 | 72 0 | 4 8 | — |
| చేపలు | 16.0 | — | 5 0 | 78 0 | 1 0 | — |
| కోడిగ్రుడ్లు | 14.0 | — | 10 5 | 74 0 | 1.5 | — |
| పాలు | 4.8 | 3.2 | 3.3 | 87 0 | 0.8 | — |
| వెన్న | 4.0 | — | 81 0 | 12.5 | 2 5 | — |

# మంచి ఉపాధ్యాయున కుండదగిన లక్షణములు

1. విద్యార్థులయెడ ప్రేమ కలిగియుండుట
2. శాంతస్వభావము కలిగియుండుట
3. ఎల్లపుడును విద్యాభివృద్ధిని చేసుకొనుచుండుట
4. సత్యము మాట్లాడుచుండుట
5. శుచిగా నుండుట
6. విద్యార్థుల ప్రకృతులను కనిపెట్టి వారిపై వాత్సల్యముతో మెలగుచుండి వారిని తన పిల్లలవలె చూచుచుండుట
7. నిష్పక్షపాతముగ నుండుట
8. కోపవశుడు కాకుండుట
9. మందబుద్ధులయెడ క్రూరత్వము చూపకుండుట
10. లోకవ్యవహారములను నెఱింగియుండుట
11. బడికాలములో కాలనిర్ణయపట్టిక ననుసరించి పాఠములను జరిగించుచుండుట
12. ఔదార్యము కలవాడును, స్నేహపాత్రుడునై యుండుట
13. పిల్లలు సహజ చతురులు అని గ్రహించి వారిని దండింప కుండుట
14. తన బోధనాపద్ధతులను విద్యార్థులకు బోధపడునటుల మార్చుకొనుచు వారికి అంశములను తెలియజేయుచుండుట
15. ప్రతిదినము నేదియో యొక నూతనాంశమును తెలిసికొన ప్రయత్నించుచుండుట

పై నుదహరించిన లక్షణములేగాక యితర ముఖ్యలక్షణము లుండవచ్చును. కాని పై వాటిని ఉపాధ్యాయుడు ఆచరణలోనికి తెచ్చినచో నుపాధ్యాయుని ప్రవర్తన (Character) మంచిదియనిపించుకొనును. అట్టి యుపాధ్యాయుడు ఆదర్శోపాధ్యాయు డనిపించుకొనుటకు వీలుండును.

ఇట్లు,
వేదుల అన్నయ్యశాస్త్రి

---

# లెక్కలను బోధించునపుడు గమనించవలసిన కొన్ని విషయములు

1. బోధింపబోవు లెక్కను సూచించునట్టియు, సదరు పద్ధతి ననుసరించి నట్టియు కొన్ని నోటిలెక్కలను ప్రథమములో ప్రశ్నించుట.
2. లెక్కలను వస్తురూపముగా ప్రశ్నించుట (Problems)

సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితోసహా) Reg. No. M. 3766

సంపుటము 30 సంచిక 12

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

మార్చి 1942

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు:

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:

రామా అండ్ కో.,

హెడ్ఆఫీసు :— ఏలూరు,

బ్రాంచెస్ :— మద్రాసు - గుంటూరు _ రాజమండ్రి.

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక

